(శా) కాబ్దేశరరం (ధ్ర) నన్దగణితే శ్రీ భీమనాథాయ
యాఖ్యాతా హైహయవంశజస్య మహిషీ శ్రీ కీత్తిన్ రాజస్య [సా] ప్రాదాద్దీప
కము త్తరాయణదినేదీప్యంత [మా] తారక [ం] కీత్తిన్ స్వగ్గన్ధు నీప్రవిత్రి
త మహీశ్రీరేకి దేవ్యాహ్వాయా ॥ శకవషన్ ౯౯౫ స్వస్తిస [ర్వన్] లోకా
శ్రయ [శ్రీ] విష్ణువద్ధన్ న మహారాజుల ప్రవద్ధన్ మాన విజయ
రాజ్యసంవత్స ౧౩ గునేణ్టియు త్తరాయణ నిమి త్తమున రాకుదిరి
కత్తిన్ రాజుపెణ్డెమురేకమ శ్రీ భీమేశ్వర మహాదేవరకు బెట్టిన
యఖణ్డ వత్తిన్లోహపు ధూసారదవియ యుక్కణ్టి

ఈ శాసనమును బట్టి తేలు ముఖ్యాంశములు మూడు (1) హైహయ వంశజుడగు కీర్తిరాజు మహిషిరేకము (2) కీర్తిరాజు గృహనామము రాకుదురు ? (3) సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజుల ప్రవర్థమాన విజయరాజ్య సంవత్సరములు దహరించుటనుబట్టి యాతడు వారికి సామంతుడని తేలుచున్నది. శకసంవత్సరము 995 శ్రీవిష్ణు వర్ధన మహా రాజుల 13వ విజయ రాజ్యసంవత్సర మాయెనన్న శకసంవత్సరము 982 (క్రీ॥ శ॥ 1060-61) లోనా విష్ణువర్ధన మహారాజు రాజ్యమునకు వచ్చియుండవలెను. క్రీ॥ శ॥ 1060-61వ సంవత్సరములో వేంగీ సింహాసనమున నున్నవాడు రాజరాజనరేంద్రుని సవతి తమ్ముడు వీరవిజయాదిత్యుడు. ఈతడు హైహయ వంశసంజాత మాళవ మహాదేవి భర్త. కావున కీర్తిరాజు క్రీ॥ శ॥ 1073 నాటికే వేంగీ మండలమున స్థిర నివాసమేర్పరచుకొనియున్నవాడే గాని శ్రీ యశోదాదేవిగారూహించి నట్లు త్రిపురి కాలచుర్యయశః కర్ణ దేవునితో వేంగీని జయింపవచ్చి వేంగీ గద్దపై నిలిచిపోయి, కులోత్తుంగ చోళునకు చోడగొంక రాజువలెనభిమాన పాత్రుడై సామంతప్రభువుగా నియమింపబడిన వాడుగాడు.[1]

---

1. The History of Andhra country between 1000 A. D-1500 A. D. అను పరిశోధన వ్యాసమున శ్రీ V. యశోదాదేవి యం. ఏ., యం. లిట్. గారు "from the inscription it is evident that Kirti Raja owed allegiance to the Chola throne, for Vishnuvardhana undoubtedly refers to Kulottunga I, mentioned by his Eastern Chalukya name and epithets; and 13th year must be taken to be an error for the 3rd year which corresponds to A. D. 1073" అనివ్రాసినారు. ఈ ద్రావిడ ప్రాణాయమమున కవసరమేమియో తెలియదు. శాసనమున విజయరాజ్య సంవత్సరములు 13 అని స్పష్టముగా చెప్పబడియుండగా దానిని 3గా సవరించుకొనుటెందులకో ? ఈ సందర్భమున జుత్తిగవాసుకి రవి సోమేశ్వరస్వామి వారి ఆలయములో వీరవిజయాదిత్యుడు కరవాల భైరవ మండపము కట్టించి నిల్పిన శాసనములో" సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజుల ప్రవర్థమాన విజయరాజ్య సంవత్సరములు౧౩న శ్రీ విజయాదిత్యదేవర కరవాలభైరవమండపమెత్తించె" నని యున్నది. అందువలన రాకుదిరి కీర్తిరాజు పెండ్లము రేకమ దానము, శ్రీవీరవిజయాదిత్యుని కరవాల భైరవ మంటప నిర్మాణ మొకే సంవత్సరమున జరిగెను. అప్పటికి వేంగీ సింహాసనమందున్నవాడు వీరవిజయాదిత్యుడుగాని కులోత్తుంగచోళుడుగాడు.

తురగా కృష్ణమూర్తి

యశఃకర్ణదేవుడు వేంగిని జయింపవచ్చెనేగాని చుట్టము చూపుగా జూచి పోవుటకురాలేదు! అట్లు వేంగి రాజ్య విధ్వంసమునకు తోడుగా వచ్చిన కీర్తిరాజును వేంగీ చాళుక్య ప్రభువు కులోత్తుంగుడు సమాదరించి సామంతునిగా జేసికొనెననుట మిగుల హాస్యాస్పదము! నమ్మదగినదియుగాదు. ఒకవేళ నట్లుగా జరిగియుండెనన్న యొక విధముగానై యుండవలయును. అదే మన యశః కర్ణ దేవుని సైన్యములోఁ బ్రముఖస్థాన మాక్రమించిన కీర్తిరాజును ప్రలోభపెట్టి తన పక్షమునకు ద్రిప్పుకొని, యశఃకర్ణుని కాశాభంగము కల్పించి, యాతని దండయాత్రను వమ్ముగావించినందులకు కీర్తిరాజును సన్మానించెనన్న నదియొకవిధముగా సమాదరణీయముగానుండును గాని శ్రీ యశోదాదేవిగారనినట్లు కీర్తిరాజునకొక సామంతమండలాధిపత్యమిచ్చి గౌరవించెననుట పొసగని విషయము. హాస్యాస్పదము గూడను. కీర్తిరాజులటుల ప్రవర్తించెననుటకు గూడదగు యాధారములు లేవు. అవెయునుగాక పరరాజులతో యుద్ధసన్నద్ధుడైవచ్చి ద్రోహబుద్ధితో స్వార్థము నింపుకొని వంచన చేసిన యాతని మంచి చెడ్డలు విచారించకనే మండలాధిపత్యను కట్టబెట్టునంతటి వెర్రితనమెక్కడను యుండదు. క్రీ॥శ॥ 1072-1073 నాటికే కీర్తిరాజు మండలాధిపత్యము వహించి యుండనిచో రేకమమహిషిగా వర్ణింపబడుట పొసగదు. కావున నంతకుముందు నుండియే కీర్తిరాజు మండలాధిపత్యము వహించి వేంగీ చాళుక్యులకు సామంతుడై వారికాదరణ పాత్రుడై యుండి యుండవలెను.

పూర్వ చాళుక్యులలో తుదివాడగు వీర విజాయాదిత్యుడు హైహయవంశ జాతనుద్వాహమాడుటనుబట్టి జూడ నాతడు వేంగీ సింహాసన మెక్క నూహించిన నాటినుండియు స్థానికముగా బలవంతులై యున్న సామంతులదనవారిగా నొనర్చుకొన యెత్తులు వేయుచుండి, సమయనిరీక్షణ గావించుచుండెనని యనుకొనవచ్చును. క్రీ. శ. 1060-61వ సంవత్సరమున వేంగి సింహాసన మాక్రమించిన నాటినుండియు నాతడు సోదరసుతుడు కులోత్తుంగ చోళుని వలన రాజ్యచ్యుతి కలుగుననియే శంకించుచుండెను. కావున దనస్థానమును పటిష్ట మొనరించుకొనదనకు గూర్చువారలననగాఁదన బంధుజనులకిలక స్థానములందు, తనకు విశ్వాస పాత్రులయిన వారికి సామంత పదవులందు నియమించుకొని వారి సహాయ సంపత్తులతో రాజ్య రక్షణ గావించుకొననెంచి కీర్తిరాజాది ప్రముఖ వ్యక్తులకు సామంతమండలాధిపత్యములు, సైన్యాధ్యక్ష పదవులు యొసంగి సన్నిహితుల గావించుకొని యుండును. వీరవిజయాదిత్యుడు క్రీ॥శ॥ 1061వ సంవత్సరమున వేంగీ సింహాసమును ద్రోహాచర్యతో నాక్రమించెను గాని సక్రమముగా పొందియుండలేదు. ఆనాటికి రాజరాజు దక్షిణాంధ్ర సీమలో కర్ణాట సేనలతో యుద్ధ నిమగ్నుడై యుండెను. రాజరాజ సుతుడు రాజేంద్రచోళుడు చక్రకోట్య మండలమున నాగవంశ పాలకులతో సమరకేళి జరపుచుండెను. అట్టి సమయమున వీరవిజయాదిత్యుడు తన్నెదిరించిన రాజరాజదేవుని పక్షము వారి నోడించి వేంగిసింహాసన మాక్రమించెను. ఆ ప్రయత్నమున దనకు సహాయకులుగా నిల్వ కీర్తిరాజువంటి సత్త్వసంపన్నుల గూడ గట్టుకొని, వారికి మండలాధిపత్య మొసగి బలము చేకూర్చుకొని యుండవచ్చును. అంతియేగాని కీర్తిరాజునకు మండలాధిపత్య మొసంగినది కులోత్తుంగుడెంత మాత్రము గాదు ! కీర్తిరాజు పెండ్లము రేకమదేవి దాక్షరామభీమేశ్వరునకు దీపదాన మొసంగుటకు పూర్వమే కీర్తిరాజు మండలాధీశ పదవి నంది యుండెను. ఆ మండలము కోన మండలమా ?

కీర్తి రాజు కోనమండలాధిపత్యమునే బడసియున్న కోనకీర్తి రాజనియే పిలువబడి యుండునుగాని రాకుదిరి కీర్తి రాజుగా పేర్కొనబడడు. ఏలనన - కోనమండలమును పాలించిన హైహయులందరు "కోన" యనుపదమున తమ నామధేయముల పూర్వార్థమందుంచుచు వచ్చిరి. ఉదాహరణకు-కోనముమ్మడి భీమరాజు, కొనరాజేంద్రచోళుడు, కోనభీమ వల్లభుడు, కోనగణపతి

మొదలగునవి. కావున కీర్తి రాజు నామమునకు పూర్వార్ధమున "కోన"పదఘటితము కానందున నీతడానాడు కోనమండలాధిపత్యము వహించియుండక, రాకుదిరి కీర్తి రాజను నామము ధరించి యుండుటచే నాతడు రాకుదురు మండలాధిపత్యమునే వహించి యుండ వలెనని తేలుచున్నది. వీరవిజయాదిత్యుడు రాకుదురు పరిసర ప్రదేశములనెల్లనొక మండలము గావించి, దానిని కీర్తిరాజునకు క్రీ॥శ॥ 1061వ సంవత్సర ప్రాంతమున నొసంగియుండును. రాకుదురు (రాఖతరం) పాగుణార విషయములోనిది.

అట్లు రాకుదురు పరిసర ప్రదేశముపై నాధిపత్యము గొన్న కీర్తి రాజు పేరుననే వ్యవహరింపబడును. రాకుదురు (రాయకుదురు)నే తన రాజధానిగాజేసి కొని పాలన మొనరించియుండును. ఈ విధాన హైహయులకు తొలి రాజధాని "రాకుదురు" (నేటి రాయకుదురు) యైయున్నది.

అయితే-ఇక కొన్ని విషయముల పరామర్శింపవలసియున్నది. రాకుదురు కీర్తిరాజు కోనమండలాధిపత్యమును తదుపరి కాలమున పొందియుండెనా ? పొందియుండిన-నెపుడు ? యెవరి వలన ? అనునవి యా విషయములు.

క్రీ శ॥ 1076వ సంవత్సరమున వీర విజయాదిత్యుడు మరణించుటతో వేంగీ రాజ్యము రాజరాజనరేంద్రుని సుతుడు రాజేంద్ర చోడుడను కులోత్తుంగ చోళదేవుని యాధీనమయ్యెను. మాతామహార్జితమైన చోళ రాజ్యమును, పితార్జితమైన వేంగీ రాజ్యము నొకే కాలమున పాలింపవలసిన పరిస్థితులుత్పన్నమగుటతో కులోత్తుంగుడు చోళసింహాసనమున దానుండి, వేంగీ సింహాసనమున దన కుమారులనునిచి రెండు రాజ్యముల బాలింప సంకల్పించెను. నాటినుండి వేంగిరాజ్యము చోళరాజ్యములో నొకభాగముగ చోళచాళుక్య రాజుల పాలనమునకు వచ్చెను. క్రీ॥ శ॥ 1077వ సంవత్సరమున కులోత్తుంగ చోళుడు తన రెండవ కుమారుడు రాజరాజు(ముమ్మడి చోళుడు) ను వేంగి పాలకునిగా నియమించిపంపెను. ఆతడొక సంవత్సర కాలము వేంగి పాలన మొనర్చి పిదప చోళదేశమునకు మగిడిపోయెను. అంత క్రీ॥ శ॥ 1078వ సంవత్సరమున కులోత్తుంగుని మూడవ కుమారుడు విష్ణు వర్థన వీరచోళుడు వేంగీ మండలమును పాలింపవచ్చెను. క్రీ॥ శ॥ 1033 వరకు పాలనమునెరపి జేష్ఠ సోదరుడు చోడగంగు (రాజరాజు) నకు క్రీ॥ శ॥ 1084లో రాజ్యమప్పగించి చోళ దేశమునకు బోయెను. చోడగంగు అయిదు సంవత్సరములు రాజ్యముచేసి క్రీ॥ శ॥ 1088-89వ సంవత్సరమున మరల వీర చోడునకు పాలనము నప్పగించెను. వీరచోడుడు క్రీ॥ శ॥ 1088 నుండి క్రీ॥ శ॥ 1093 వరకును, అతనిసోదరుడు పరాంతకుడును నామాంతరమున బరగు విక్రమ చోళుడు, ఆవెన్కను వేంగీ రాజ్య పాలన మొనరించిరి. వీరందఱును వేంగిరాజ్యము పాలించుచున్న తరిని తూర్పు చాళుక్య బిరుదముల వహించుచువచ్చిరి.

కులోత్తుంగ చోళదేవుని ప్రతినిధిగ వేంగీని పాలింప వీరచోడుడు క్రీ॥ శ॥ 1084లో మలిసారి వచ్చుసరికి వేంగీ రాజ్యమతి క్లిష్ట పరిస్థితులలో జిక్కియుండెను. వేంగీ ప్రథమరాజ ప్రతినిధి రాజరాజ చోడగంగు, ఆతని సర్వసైన్యాధ్యక్షుడు మొదటి వెలనాటి గొంకరాజు శత్రువులచే జంపబడిరి. వీరచోడుడు వేంగిని ప్రవేశించుసరికి చక్రకూట సోమేశ్వరుని సైన్యము వేంగీని ముట్టడించి ముప్పు తిప్పలబెట్టుచుండెను. వీరచోడుడు బహుళ సేనాపరివృతుడై వేంగీని ప్రవేశించి రాజ భూషణ సోమేశ్వరునిదాకి, యుద్ధమున నాతని నోడించి పారద్రోలెను. అంత వీరచోడుడు తన సామంతుని, మహామండలేశ్వర "ఇమ్మడి వేదుర" ను సర్వ

తురగా కృష్ణమూర్తి

సైన్యాధ్యక్షునిగ నభిషేకించి, కళింగముపైనెత్తిపోయెను. ఈ సమయమున నాతడు జయకాంక్షియై పాగుణార విషయములోని జుత్తిగ గ్రామ మందలి వాసుకిరవిసోమేశ్వరస్వామివారి ఆలయమునకు దీపదానమొసంగి శాసనము నిలిపెను.*

ఆ శాసనము ననుసరించి వీరచోడుడు కళింగరాజ్యముపై దండయాత్ర చేయుటకు ముందు విజయము కాంక్షించి స్వామికి దీపదానము చేసి జైత్రయాత్ర కరిగినట్లు తెలుచున్నది. రాజరాజు పాలనలో వేంగీరాజ్య సామంతులలో కొందరు యెదురుతిరిగి స్వాతంత్ర్యము ప్రకటించి, అరాజకమును సృష్టింప యత్నించుట నెరింగి కులోత్తుంగ చోళుడు వీరచోడుని, వేంగీమండలమున కంపియట రాచకార్యముల జక్కబఱుపనెంచిన ఫలితముగ వీరచోడుడు వేంగీరాజ్యము ప్రవేశించినదే తడవుగ స్వామిద్రోహులగు సామంతుల తొలగించి, కొత్తవారల నియమించుటలో లేక ప్రాతవారిని మందలించి స్వపక్షులుగా జేసికొనుట గావించి, తన స్థానమును సుస్థిరముగా గావించుకొనుట జరిగెను. ఆ యుద్యమములో దనకు గూర్చు వాడగు "వేదుర"ను సర్వసైన్యాధ్యక్షులగా నియమించుకొని, ఆతనికి "సింధూయుగ్మంతర విషయము" సైన్యాధిపత్య మొసంగెను. అటులనే మేడమార్యుడను బ్రాహ్మణుని సైన్యాధ్యక్షునిగా జేసి "రాజరాజ-బ్రహ్మమహారాజు" అనుబిరుద మిచ్చి సత్కరించెను. ఆతనిచే నిర్మింపబడిన విష్ణ్వాలయము నకు "బెల్లూరు" "కాలేరు"లను గ్రామముల దానమొసంగెను. ఇట్టి నియామకములలో నొకటైయుండనోపు ! రాకుదురు పిదప సంగరాయనిది.

ఈ యూహ సేయుటకు గల కారణముల నిట వివరించుట యుక్తము. క్రి॥ శ॥ 1073వ సంవత్సరములో రాకుదిరి కీర్తిరాజు అధికారములో నున్నట్లు పైన దెలిపిన శాసనము వలన ద్యోతకమగుచున్నదికదా ! కులోత్తుంగసుతుడు రాజరాజు కాలమున వేంగీసామంతులెదురు తిరిగి స్వాతంత్ర్యము ప్రకటింప యత్నించిరని గూడపైన వివరింపబడినది. కావున కీర్తిరాజు ఆ తరుణములో స్వాతంత్ర్యము వహింప నుద్యమించి యుండును. వీరచోడుడు మలిసారి వేంగినేలకే తెంచినపుడు కీర్తిరాజును తొలగించి, యాతని స్థానమున సంగరాయని నిలిపియుండవచ్చును ! లేదా వయోవృద్ధుడైన కీర్తిరాజు గతించియైన యుండ

---

* శకవర్షంబులు ౧ (౦) ౧౧
స్వస్తి శ్రీ సర్వలోకాశ్ర
యశ్రీ (విష్ణు) వర్ధమాన విజ
యరాజ్య సంవత్స
ర (౦) బులు (౨౦) శ్రాహిశ్రీ
వీరచోడ దేవరడు
త్తిక సోమేశ్వర మహా
దేవ(ర)కు నిలిపిన ది(వి)
యలు మూన్డు ...........

వచ్చును ! ఆ కారణమున సంగరాయని నియామకము జరిగి యుండవచ్చును. క్రీ॥శ॥ 1078వ సంవత్సరము పిమ్మట కీర్తిరాజు గురించి యే వృత్తాంతము వినరాలేదు. అందుచే నీపైన యుదహరించిన వానిలోనేదియో యొకటి జరిగి, కీర్తిరాజు కోనమండలాధిపత్య మంద కుండగనే గతించియుండును. తత్కారణమున కోన మండలము నేల వచ్చిన కోన ముమ్మడి భీమరాజు (క్రీ॥శ॥ 1078-1083) మొదలగువారు రాకుదిరి కీర్తిరాజు విషయమును తడవకనే తమ శాసనముల నిలుపుట సంభవించియుండును.

రాకుదురులోని శాసనముల పరిశీలింపనేగిన శ్రీ ముసునూరి సాంబశివరామమూర్తి, రామచంద్రపురం U. S. M. కాలేజి Ancient History లెక్చరరు శ్రీ జాస్తి దుర్గాప్రసాదరావు గారలకు లభ్యమైె రాకుదురు శ్రీ సకలేశ్వరస్వామి ఆలయ ద్వార బంధమున కిరుప్రక్కలగల శాసనముల*లో నొకదానిని బట్టి రాకుదిరి కీర్తిరాజు వెనుక రాకుదురుసంగరాయడా ప్రాంతముపై నధికారము వహించినట్లూహింపబడుచున్నది. రాకుదిరి కీర్తిరాజును, యీ సంగరాయడును యేక వంశము వారలై యుందురా? భావి పరిశోధనమునగాని తేలదు.

ఈ రాకుదురులో హైహయ పాలనమెంత వరకు జరిగెనో, రాకుదిరి కీర్తిరాజు, సంగరాయల వెనుక నీ మండలాధిపత్యమెవరు వహించిరో తెలియదగు యాధారము లభింపలేదు.

కోన హైహయులలో తొలి ప్రభువుగా కీర్తిరాజు ప్రశంసింపబడుట నాతడు రాకుదురు మండ లాధిపత్యమువహించి యుండుటను బట్టి జూడ మొట్టమొదట కోనహైహయులు రాకుదురు పరిసర ప్రాంతముల రాకుదురు రాజధానిగా భావించి, క్రమశః గోదావరిని దాటి విస్తరించి నేటి రాజోలు, అమలాపురం తాలూకాలకు వర్తించు కోనమండలము (కోనసీమ) కధిపతులై యుందురని తోచుచున్నది.

ఈ రాకుదిరి కీర్తిరాజు, సంగరాయలు పానారసీమలోని రాకుదురు మండలమును పాలించుచున్న కాలముననే కోన ముమ్మడి భీమరాజు క్రీ॥శ॥ 1078-1082 మధ్యకాలమున రాజాధిరాజరాజేంద్రచోళుని వలన రాజ్యాధికారమును పొందినట్లు శాసనముల వలన దెలియవచ్చెడిని. ముమ్మడి భీమరాజు, కీర్తి రాజులకు మధ్యగల సంబంధమేమియో పరిశోధింపవలసి యున్నది. కోనముమ్మడి భీమరాజు హైహయుల వంశములోని మరొక శాఖకు చెందిన వాడగునా?

---

* ౧. స్వస్తిశకవషన్ంబులు ౧౦౦౭ గునేన్టి ఉత్తరాయ
౨. ౹౹ నిమిత్తమున రాకుదిరి సంగరాయక్షేత్ర
౩. కన్తున్ కస్వామి సకలేశ్వరుకుందేవరకి
౪. అఖన్డ మణి దీపమునకు దరియబోయ
౫. .... .... .... .... ....
౬. .... .... .... .... ....
౭. .... .... .... .... .... పోయిచ్చిండు ....
౮. నిండుకొని నిత్యము మానెన్డున్ యీ సాని
౯. యంపాడిని ఆచంద్రాక్కన్ ముబో
౧౦. యంగల వాన్డు ... .... .... (అప్రకటితము)

తురగా కృష్ణమూర్తి

# కాకతి ప్రతాపరుద్రదేవ మహారాజు

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

కాకతీయ చక్రవర్తులలో కడపటివాఁడీ మహారాజు. ఆరిపోనున్న దీపమువలె నీతని కాలమున నాంధ్ర పౌరుష మువ్వెత్తుగ నొక్కమారు విస్ఫురించినది. ప్రతీచ్య నృపతులు దాక్షిణాత్యనరపతులు ఔత్తరాహరాజన్యులు ప్రతాపరుద్రుని ప్రతాపమున కోడిరి. అతని యెడల నసూయాదులు జనించుట మానవసహజమే. వానిచే పీడితుఁడైన కారణముననో మెడమీదనున్న ముస్లిందండనాయకుల యొత్తిడి చేతనో యాదవ మహారాజు తురకలకుఁదోడ్పడెను. స్వీయులగు రెడ్డినాయకులును కదనభూమిలో ద్రోహము చేసిరి. ఈ మహారాజు తురకల బందీయయ్యెను. అభిమానధనుఁడు ఢిల్లీకిఁబోవు మార్గ మధ్యముననే స్వేచ్ఛమై నర్మదా నదమునందు మునిఁగి యసువుల వీడెను. ఆంధ్రభూమి యవనాబ్ధి మగ్నమైనది. ఈ విషయములు చరిత్రకారులెల్ల నెఱిగినవే.

కాని యా మహారాజు చరిత్రముననేకాంశములిప్పటికిని నిర్ణీతములు గాలేదు. ఊహావిషయములుగానే యున్నవి, చరిత్రకారులు పరస్పర విరుద్ధములయిన యూహల జేయుచునే యున్నారు. కొంతవరకు వ్యక్తివైమనస్యములు, కులభేదములు భాషాభిమానములు అడ్డువచ్చి యుండుటయుఁదెల్లమే. అట్లే మతాభిమానములు. అట్లవి యడ్డు రాఁగూడదనుట సత్యాభిమానుల కిష్ట విషయమే. కాని వ్యవహారమున నట్లు జరుగదుగదా! ప్రమాణములు తక్కువయే, అవియును ఒండొంటికి విరోధముగగూడ నున్నవి. అది మన దురదృష్టము. కాని వానియందు కొన్ని ప్రథమ గణ్యములు తదపేక్షయా కొన్ని సారహీనములుగా నుండక తప్పదుగదా! అయ్యెడల వాని ప్రామాణ్యమును విమర్శించి సారవత్తరమును గైకొనవలయుననుట నిర్వివాదాంశమే. ఇరువాదములు విని పరిశీలించి నిష్పక్షపాతముగ తన నిర్ణయము నొసంగు దృష్టియే మన కవలంబనీయము. కాలముగడచు కొలది క్రొత్తక్రొత్త యాధారములు చరిత్ర కారులకు లభ్యములుకాకమానవు. అపుడు చరిత్రకారులు తమ సిద్ధాంతములను తాము చేసినవయ్యును తదనుకూలముగా పునర్విమర్శనము చేసికొనుటయు వలసినచో నూత్న సిద్ధాంతములఁ జెప్పుటయు సత్యప్రియత్వమునకు సూచకము. ఇంకొక్కమనవి. ఒక్కొక్క యాధారమును శిలాశాసనమేకానిండు, తామ్రశాసనమే కానిండు కావ్యములే గానిండు శాస్త్రములేగానిండు నిశితముగా విమర్శించి గ్రహింపవలయును. గొన్నియంశములు పరస్పర విరుద్ధములుగా నున్న సమన్వయ మార్గము కలదా యని యన్వేషించుటయు, సమన్వయ మసాధ్యమైన దుర్బలముల త్యజించి బలవత్తరమును స్వీకరించుట యుపాది.

కాకతీయ చరిత్రమున కాధారముగా సమకాలీన శాసనములున్నవి, కావ్యములున్నవి, వాని వ్యాఖ్యానములున్నవి, మతగ్రంథములున్నవి, తురుష్కుల వ్రాతలున్నవి, పరస్పర విరోధములుతప్పవు. వానినన్వయించినపుడు సత్యదీక్షయొక్కటియే యవలంబ్యము.

ఈ కఠినతర కార్యమున గొందరికే జయము కల్గును. కాని అట్లు జయము లభించెనను విశ్వాసము లేకున్న పరిశోధన మెట్లు సాధ్యము. నా ప్రయత్నమున సాఫల్యము కల్గెనోలేదో. ఇందు ప్రమాణ వ్యాసముల నిర్దేశించుచున్నాను. వ్యాస కర్తల నామముల విధిలేనప్పుడు తప్పఁజెప్పలేదు. విషయ విమర్శనమే ప్రధానముగాని వ్యక్తి గుణగణములు విమర్శనీయములు గావని నావిశ్వాసము. వాదబలముచే లక్షింపవలయుననుట పునరుక్తియని నాతలంపు.

ఈ ప్రతాపరుద్ర మహారాజు జన్మించినదెపుడో యింతవరకు నిశ్చితమైనట్లు గానరాదు. క్రి. శ. 1254 ప్రాంతమున నున్నట్లు కాకతీయ సంచికాకారుల యభిప్రాయము. చిన్నతనముననే, ఏడేడుల లోపలనే మాతామహిరుద్రమదేవి దత్తుచేసికొనె నని ఆంధ్ర కాకతీయ సమకాలిక రాజుల చరిత్ర కర్తల తలంపు. వారి యూహల కాధారము మల్కాపుర శాసనముగా వారే చెప్పియున్నారు. కనుక నా శాసనమును సుదీర్ఘముగా పరిశీలింపవలయును. దాని ప్రామాణ్యమును విమర్శింపవలయును. ఆ శాస నము నాటికి కాకతిరాజవంశమెట్లున్నది అనియాలోచింపవలెను. ఆ శాసనము క్రి. శ. 1261 నాఁటిది. నందన సంవత్సరమున సూర్యగ్రహణమున, పాలనము చేయుచున్న రుద్రమదేవరాజగురువులు శ్రీ విశ్వేశ్వర శివదేశికుల కొసంగిన దాన వృత్తాంతమందు పొందు పఱపబడియున్నది.

దాని కాలము దుర్మతి సూర్యగ్రహణకాలము అయిన క్రీ॥ శ॥ 1261

శాసనకవి యెవరో చెప్పఁబడియుండలేదు. రాజగురువులు శ్రీ విశ్వేశ్వర శంభులే యని గొందఱి యూహ. అది రుద్రమదేవి రాజ్యము

శాస్త్యేషా చతురంబురాశిరశనాం। శ్రీ రుద్రదేవీ భువం స్వయం॥ నాల్గు సముద్రములు మొలనూలుగాగల భూమిని శ్రీరుద్రదేవి స్వయముగా పాలించుచున్నది. అనియా శాసనముననున్నది. దీనిచే గణపతి దేవుఁడప్పటికి గతించియుండెనని ధ్వనించుచున్నది. అతఁడును రుద్రమ్మ యౌగపద్యముగనే కొంతకాలము కాకతి రాజ్యము నేలియుండిరనుట చరిత్రకెఱుక పడి యున్నయంశమే. క్రీ॥శ॥ 1261 నాటికి గణపతి జీవించి యుండెనా ?

South Indian Inscriptions Vol. X నం. 371 శాసనము గణపతి వేయించినదే త్రిపురాంతకమున నున్నది. దీని కాలము శకవర్షము 1182 రౌద్రి ఆషాఢము. కర్కాటక సంక్రాంతి సమయము క్రీ॥శ॥ 1260 ఆగస్టు అగును. కనుక నానాటికి గణపతి జీవించి యున్నాడు.

అదే సంపుటములో నం. 393 త్రిపురాంతకు శాసనము, దీనికాలము క్రి. శ. 1183 దుర్మతి కార్తీకము = క్రి. శ. 1261. దీనిని బట్టి చూడఁగా గణపతి యున్నట్లు తోచుటలేదు. ఇది శ్రీమత్ రుద్రమదేవ మహారాజుల దివ్య రాజ్యవర్షము రెండవ దానిలో వేయించబడినట్లు నిర్దేశముకలదు. అదే సంపుటములో నం. 395 శాసనమే మల్కాపుర శాసనము. దీని కాలము శ. సం. 1183 = క్రీ॥ శ॥ 1261

A.H.R.S. Vol. 38 Pt. IV

దీనిలో స్పష్టముగ గణపతిని వర్ణించుచు "తస్యాయం తనయః త్రయీమయతనో ర్దైవాత్ భవానీపతేః లబ్ధ క్ష్మాం సమపాలయత్ గణపతిక్ష్మా పాలచూడామణిః" అని కలదు. "సమపాలయత్" అని భూతకాల నిర్దేశము కలదు. కనుక నప్పటికి గణపతిలేడనుట నిశ్చయమే

అట్లే "అద్యాప్యుద్దామ దర్పాన్ దుపర తప్పృతనా"

ఇప్పటికిని నతని సేనదర్పమును విరమించుకొనియున్నది అని కలదు. ఇప్పటికి ననుటలో గణపతి మరణానంతర మనే ధ్వని కలదు గదా ! గణపతి అతని తండ్రి మహాదేవుడు మరణించునప్పటికి క్రీ॥ శ॥ 1208 బాలుడనియు యాదవరాజు జైత్రుగి త్రికళింగాధిపతిని జయించి ఈతని చెఱనుండి విడిపించెననియు, హేమాద్రి అతని యాస్థాన విద్వాంసుడు రచించిన రాజ ప్రశస్తిలోఁ గలదనుట ఎల్లరెఱిఁగినదే. అప్పటికాయనకు పదిపండ్రేండ్లున్నవనుకొనవచ్చును-కావున నతడు దాదాపు డెబ్బది నాలుగేండ్లు జీవించి వృద్ధుడై మరణించెను.

మరణించుటకు మున్నతడు రాజ గురువులకు మందర గ్రామమునీయ వాగ్దానము చేసెను. కాని తానే యిచ్చుటకు ముందే మరణంచుట జరిగినది. రుద్రమ ఆ వాగ్దానము తాను నెరవేర్తునని యన్నది. ఆతండనుజ్ఞ నిచ్చినాడు. మరణించినాడు. అంత సూర్యగ్రహణ సమయమున నామె—

శ్రీ విశ్వేశ్వర శంభవే । గణపతి క్షోణీశ్వరే । ణాదరా
ద్గ్రామం । మందరనామధేయ। మఖిలై ర్వాగ్దత్త । మాయైస్సమం
తత్పుత్రీ । తదనుజ్ఞయా పశుపతేః । శ్రీ రుద్రదేవీపురః
ప్రాదా । ద్గ్రామ । వెలంగపూడి సహితం । సీమాష్టకే । నావృతం ॥.

పశుపతికి అనగా విశ్వేశ్వర గురురూపుడైన శివునికే ఇచ్చి శాసనము వేయించినది.

ఇందే విషయముననైనను శంకకవకాశము కలదా ? లేదనియే స్పష్టము. ఇచ్చినది రాజు. ఇచ్చినది గురువులకు. ఇచ్చి నది భక్తితో. ఇచ్చినది తండ్రి వాగ్దత్తమును నెరవేర్చ కనుక నీప్రమాణము బలవత్తరమును విశ్వాసమును. దీనియందలి యంశ ములుగాదనుట సాధ్యముగాదు.

ఇందే రుద్రమ కుమారుని ప్రస్తావము కలదు. శాసనములందీతని పేరు కానవచ్చుటయు ప్రథమముగ నిందే. ఇందే రుద్ర మను వర్ణించుచు కవి.

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

శ్రీవిశ్వేశ్వర దేశికేంద్ర శివహస్తోద్భాసిదోర్విక్రమః
త్రిక్షోణీశజగద్దళః ప్రతిబల ప్రధ్వంసి జన్మోత్సవః
యస్యాః కాకతివంశ మౌక్తికమణే శ్రీ రుద్రదేవ స్సుతః
తస్యాః కిం కథయామ వైభవ మతః శ్రీ రుద్రదేవ్యాః పరమ్ ॥

శ్రీ రుద్రదేవి కాకతి వంశమౌక్తికమణి । ఆమెకు శ్రీరుద్రదేవుడు సుతుడు. అతఁడు శ్రీ విశ్వేశ్వర దేశికేంద్ర శివుని హస్తముచే నుద్భాసి = ఉజ్జ్వలించుచున్న (ఎన్నటికి విజృంభింపనున్న అని యర్థము కాదు) బాహు విక్రమము కలవాడు. అతడు త్రిక్షోణీశ జగద్దళః =ముగ్గురు రాజుల జగత్తును, దళః అననేమో స్పష్టము గాదు. బహుశః దళనః చీల్చు వాఁడని యర్థము కాఁబోలు. ముగ్గురు క్షోణీశులనఁగా కాకతి రాజ్యమునకు దక్షిణరాజులు పడమటి రాజులు ఉత్తరరాజులు. అతఁడు ప్రతిబలమును ప్రధ్వంసము చేయును– జన్మోత్సవము కలవాఁడు. అనఁగా పుట్టుకతోనే ప్రతిబలమును నాశనము చేయువాఁడు. అతని పుట్టుకయే యొక పండుగ. అట్టి రుద్రదేవుడు కుమారుఁడైన శ్రీ రుద్రదేవి వైభవమునట్లు చెప్పుట కన్న నితరముగా వేఱుగా నెట్లు వర్ణింప గలము ? అని రుద్రదేవుని వర్ణనము. ఈ రుద్రదేవుడే ప్రతాపరుద్రుఁడని కాకతీయ సంచికాకారుల వాదమును వీరభద్రరావు గారి వాదమును. వీరి మతానుసారము 'సుతః'అనగా పెంపుడు కొడుకని యర్థము కాదు. ఇతఁడౌరసపుత్రుడేయని, నామనవి. ఇతఁడు వేరు ప్రతాపరుద్రుడు. రుద్రమదేవి దౌహిత్రుడనంతరము దత్తుడైనవాడు వేరు.

ఈ శాసనము ప్రకారము శాసనకవి చెప్పుచున్న క్రమమయిన రుద్రమదేవి కుమారుడు పరాక్రమశాలి. ముగ్గురు క్షోణీశుల జగత్తును చీల్చినవాడు. అప్పటికే అనగా క్రీ॥శ॥ 1261 నాటికి అతని పేరు రుద్రమదేవుడు. అతఁడు అప్పటికే ప్రఖ్యాత పౌరుషశాలి.

మల్కాపుర శాసనమెంత ముఖ్యమో విద్యానాధ కవికృత ప్రతాపరుద్రీయ యశోభూషణమును అంతముఖ్యము. విద్యానాథుఁడు ప్రతాపుని కాలమునందున్నవాడు. అతని వలన సన్మానము పొందినవాడును. అతఁడు వ్రాసిన ప్రతాపరుద్రీయమును విశ్వసనీయమే. తాను జూచిన రాజునే వర్ణించినాఁడు. ఆ గ్రంథమును సమగ్రముగా పరిశీలింపవలసినదే.

మల్కాపుర రుద్రుడు శ్లాఘ్య పరాక్రముడగుటకు అతడు హీనపక్షము ఇరువదియేండ్లవాఁడు అయియుండవలయునుగదా! ప్రతాపరుద్రునభిషేక కాలము క్రీ.శ. 1295 ప్రాంతములందని కొందఱిమతము. ఆ విషయమును దర్వాత చర్చింతము. అప్పుడయినను తర్వాతనైనను అతని కప్పటికేబదినాలుగేండ్ల ప్రాయమగును.

మల్కాపుర శాసన కాలమునకు కాకతి ప్రతాపరుద్ర దేవుఁడు క్రీ.శ. 1254 ప్రాంతములో జన్మించినందున నేడేండ్ల వాఁడనియు కాకతీయసంచికకారుల యభిప్రాయము. వీరభద్రరావుగారు ప్రతాపరుద్రుని జనన సంవత్సరమును స్పష్టముగా నిర్ణయింపకున్నను 'సుత' శబ్దమునకు పెంపుడు కొడుకనుటయే వారి యభిప్రాయమని తోచుచున్నది. జయంతి రామయ్యపంతులవారి మతమిందుకు విరుద్ధమని కాకతీయ సంచికకారులే వక్కాణించియున్నారు.

మల్కాపుర రుద్రుడు ఆ శాసనమునాఁటికే విఖ్యాత పౌరుషడగుట కాకతీయ సంచికాకారుల వాదమును నిర్మూలించుచున్నది. మఱి ప్రతాపరుద్రీయమును జూచినను రుద్రుడు ప్రతాపరుద్రుడేయనుట నిర్మూలమగుచున్నది. ప్రతాపరుద్రీయమునఁ జెప్పినది సూక్ష్మముగ నిట్లు. రాజ్యాభిషేక కాలమునకుముందే అతఁడు యువరాజు. స్వయంభూదేవుని యాజ్ఞచే నతనినంతకు ముందే దత్తునిగ గైకొన్నది. స్వయంభూదేవుఁడు కలలో నతనికి యౌవరాజ్య మిమ్మన్నాఁడు. దిగ్విజయముచేసి నాల్గు సముద్రముల జలములఁదెచ్చి అతనికభిషేకింపుమని మంత్రులన్నారు. రుద్రమ అట్లే యుద్ధసన్నాహ మొనర్చుకొని యుద్ధయాత్రకు బయలుదేరనుండఁగా ప్రతాపరుద్రుడామెను నివారించి తానే దిగ్విజమునకు బయలుదేరెను. దిగ్విజయానంతర మతనికి రుద్రమ రాజ్యాభిషేకము చేసినది. అభిషేక కాలమునకతడు చిన్నవాడు. ఈ వాక్యముల నొక్కొక్కటియు మాల్కాపుర రుద్రదేవుఁడు ప్రతాపరుద్రుఁడు కాదని నిరూపించుచున్నవి.

వరుసగా విమర్శింతము

I. మల్కాపుర రుద్రుఁడు ప్రఖ్యాత విక్రముఁడు గదా! ప్రతాపరుద్రీయ రుద్రుఁడు దిగ్విజయ కాలమునకుఁ గాఁడు. ప్రతాపరుద్రీయము నాటక ప్రకరణమున.

కంచుకి : కి మనుమతం రాజపుత్రస్య దిగ్విజయ ప్రస్థానం రుద్రనరేశ్వరేణ ?
రుద్రమహారాజు రాజపుత్రుని దిగ్విజయ ప్రస్థానము ననుమతించెనా ?

దార : కథం కథమప్యనుమతం.

ఎట్లో యెట్లో యనుమతింపబడినది.

కంచు : స్వనామానుగుణ మిదం రాజపుత్రస్య య త్సజ్జీకృత సాధనం మహారాజం సపాదోపగ్రహం నివార్య స్వయమేవ జైత్రయాత్రాయా ముత్తిష్ఠతే.

సాధనములు సిద్ధము చేసికొనిన మహారాజును పాదములు పట్టుకొని నివారించి జైత్ర యాత్రకై లేచుట రాజపుత్రునికి అతని నామానుగుణముగా నున్నది.

దార : ఆర్య, అననుభూత యుద్ధ పరిశ్రమో యువరాజః

ఆర్య, యువరాజు యుద్ధపరిశ్రమము ననుభవించి యెఱుఁగడు. ఆలోచింపుఁడు.

గణపతి రాజ్యాంత కాలమున సామ్రాజ్యమున నెన్నియో కల్లోలములు తటస్థించినవి. జటావర్మ పాండ్య మహారాజు తాను గణపతిని జయించినానని యెఁ జెప్పుకొన్నాడు. గణపతి వయస్సున నున్నపుడని యూహింపలేముగదా! కాంచీపురమును దక్షిణ రాజు

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

లాక్రమించుకొన్నారు. గణపతి యా వయస్సున నేమియు చేయలేకపోయెను. రుద్రమ రాజ్య ప్రారంభమున శత్రువులు గోదావరి దనుక తరుముకొనివచ్చెను. వెలుగోటివారి వంశ చరితాదులు ప్రసాదిత్య నాయడు గణపతి యనంతరము కాకతిరాజ్యము నాశించిన వారిని నాశనము చేసినాఁడని చెప్పుచున్నవి. అట్లే శాసనము లందును కాకతిరాజ ప్రతిష్ఠాపనాచార్యులు కానవచ్చుచున్నారు. రుద్రమకు సామంతులు కొందఱెదురుతిరిగినారు. యాదవరాజు లెత్తి వచ్చినారు. ఈ సందర్భములో కుమారుఁడు పరాక్రమము చూపియుండఁడా ? దానికనుగుణముగా విశ్వేశ్వరులు రాజగురువుల యాశీర్వాద మహిమయే, రుద్రదేవుని దోర్విక్రమమునకు గారణమని మల్కాపురము శాసనము చెప్పుచుండుట లేదా ?

రుద్రమకు తర్వాత వచ్చిన యుద్ధములు కానిపింపవు. అంత్యకాలమునకు మరల దక్షిణ రాజుల యుద్ధములు తప్ప నట్లున్నది. దానిని జూచియే రుద్రమ వయస్సు చెల్లియే యున్నను తానే యుద్ధమునకు బయలుదేఱినట్లును, ప్రతాపరుద్రుడామెను నివారించి యుద్ధము నెఱుఁగని తాను తన శక్తిని నిరూపించుకొని రాజ పదవి కర్హుడీసత్తుడని చాటుటకు తానే యుద్ధమునకు బయలుదేరుట సహజమేగదా ! కావుననే విద్యా నాథుఁడు రుద్రమకు కలలో స్వయంభూదేవుఁడు కనిపించి దౌహిత్రునికి రాజ్య మిమ్మని యాదేశించి నాఁడని వ్రాయఁగలిగినాడు అది నిజమేయయి యుండును. తమ కులమునకు స్వయంభూదేవుఁడే తారకుఁడని గణపతి, రుద్రదేవుల విశ్వాసము. స్వప్నములు విస్పష్టములు గావని, నవి దృశ్యమానములగుటయని యాధునికుల సిద్ధాంతమును. రుద్రమ పెద్ద వయస్సుతో తానుంట నాలోచించి దౌహిత్రునికి రాజ్యమిచ్చుటయు బాగని తలంచియుండుట అసహజముగాదు. ఆ మనోరథ మీ స్వప్నమున నిట్లు ఫలించియుండును. కనుక ప్రతాపుడట్లు యుద్ధమున, ననను భూత పరిశ్రమఁడయియుండుట సహజముగానే యున్నది. దిగ్విజయమును సూచించినది మంత్రులు. రాజ్యాభిషేకము జరిగిన పిమ్మట యుద్ధమునకుఁబోవుట యేకాక యుద్ధమున జయించి వచ్చిన వానికి రాజ్యార్హతను నిరూపించుకొన్న తరువాతనే రాజ్యాభిషేకము జరుగుట బాగా యున్నది. చికిత్సలో మంత్రులు రెండవ పక్షమునే స్వీకరించియుండుటయు సహజమే. ప్రజలకు భావిమహారాజునెడల (దత్తుని యెడల ననుటమరువరాదు) అనురాగము రూఢమగుట యేర్పడును గదా !

ఈ విమర్శము చేత మల్కాపుర రుద్రదేవుఁడు ప్రతాపరుద్రీయ ప్రతాపరుద్రదేవుఁడు, భిన్నులని తేటపడుచున్నది.

11. ఇంకొకటి. మల్కాపుర శాసనమున నతని పేరు రుద్రదేవుడు- దాని కుపపదము లేదు. రుద్రదేవి శాసనముల నామెకు రుద్రదేవ మహారాజులని వ్యవహారనామము. కావున నీరుద్రదేవుని కుమారరుద్రదేవులని యనియుండపచ్చును. అట్లును అనలేదు. మహారాజ శబ్దమే లేదు. కనుక "రుద్రదేవు"డని పుట్టుపేరు. యువరాజ పదవిరాలేదు. కావుననే నతనికి కుమార మహారాజ వ్యవహారములేదు. సారాంశము రుద్రదేవుఁడని అతని పుట్టుపేరు.

ప్రతాపరుద్రీయమున నా మహారాజు పుట్టు పేరు ప్రతాపరుద్రుడనియే యున్నది.

నటి : కథం ! కథా నాయక నామధేయానుబంధ మనోహరం ఖలు నాటకం ? ప్రతాపోపపదాంకితం. తస్య రాజ్ఞో నామ కథం జాతమితి పృచ్ఛతే।

ప్రతాపుడను నుపపదమున నంకము ఆ రాజున కెట్లు వచ్చెనని యడుఁగు చున్నాను.

సూత్ర-: ప్రియే శ్రూయతాం

తం సుజాతం సముద్వీక్ష్య క్షోణ్యాం రవిమివోదితం
ప్రతాపరుద్ర ఇత్యాఖ్యా మకరోత్ కాకతీశ్వరః॥

భూమిపై రవివలె చక్కఁగా నుదయించిన యతనికి కాకతీశ్వరుఁడు ప్రతాపరుద్రుఁడని పేరుపెట్టెను.

కనుక ప్రతాపరుద్రుఁడని కడపటి చక్రవర్తికి పుట్టుపేరు. మల్కాపురము వానికి రుద్రదేవుఁడని ప్రతాప రుద్రీయము వానికి ప్రతాపరుద్రుఁడని.

III. అప్పటి కతఁగా దిగ్విజయ కాలమున కాతఁడు చిన్నవాఁడుగదా. యుద్ధపరిశ్రమ మెఱుఁగని వాడుగదా. ప్రతాప రుద్రీయ మతని కెంత వయస్సో చెప్పుచున్నది.

ద్వితీయాంకము,

(1) నాటక ప్రకరణము, ప్రవేశిక, 3

తత్ స్నేహ్నాంకిల యౌవరాజ్యమపి మే బాలోత్సవే క్రీడతః

యౌవరాజ్య మిచ్చు సమయమునకు ప్రతాపరుద్రుఁడు బాలోత్సవములోఁ గ్రీడించుచున్నాఁడు. దిగ్విజయ కాలమునకు ముందే ఆతనికి యౌవరాజ్యమీయఁబడి యున్నది. 'అతిసృష్ట యౌవరాజ్యస్య' అనియు 'అస్మిన్ని ధేహిధారేయే గుర్వీమఁర్వీధురాం' అని ప్రతాపరుద్రీయము. మఱియు అంకమునఁన :- పురో :- తదారోహతు ప్రాగతిసృష్ట యౌవరాజ్యస్య ప్రతాపరుద్రస్య భుజశిఖరం సాగరమేఖలా "భూమియారోహించునుగాక." ముందే యౌవరాజ్యమీయఁబడి యున్న ప్రతాపరుద్రుని భుజశిఖరమును యౌవరాజ్య మీయఁబడినది. గుఱుతుచే నట్లు స్థిరీకరింపవచ్చును.

**South Indian Inscriptions Vol. X** నెంబరు 469 జూఁకల్లు శాసనము పల్నాడుతాలూకా. కాలము శ.క.1213= క్రి. శ. 1291. ఇందు కాకతీయ కుమారరుద్రదేవ మహారాజులకు పుణ్యంగాను అని కలదు. తర్వాత నాలుగయిదేండ్ల లోపలనే యాతని కభిషేకము. కావున నీ'కాకతీయ కూమార రుద్రదేవుఁడు' ప్రతాపరుద్రుఁడే అప్పటి కతఁడు బాలుఁడు.

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

కుమార రుద్రదేవుఁడని వ్యవహారమే అతఁడు యౌవరాజ్యధురంధరుడని తెల్పుటకు చాలును. ఏలన రుద్రమకు 'రుద్రదేవమహారాజు'లని శాసనములందు వ్యవహారము. ఒక్క మల్కాపుర శాసనమునను తర్వాత నింకొక్క శాసనమునను దప్ప నామెకు 'రుద్రదేవి' నామస్మరణ లేదు. ఆ రెండవశాసనము S. I. Inscrption Vol. X లో నెం. 422 శాసనము, పల్నాడు తాలూకా, దుర్గి గ్రామము. శాసనకాలమున శక :—1091 = క్రీ॥ శ॥ 1169 ఇందు గణపతిదేవ మహారాజుల పట్టోద్ధతియైన శ్రీరుద్రమహాదేవి ఓరుగల్లు నిజరాజధానిగాను' అని కలదు. పట్టోద్ధతి యననేమో.

తక్కు శాసనము వెల్లనీమెకు 'రుద్రదేవమహారాజు'లనియే వ్యవహారము. బూదపూరు శాసనము క్రీ॥ శ॥ 1198 మల్యాలగుండ నాధుని శాసనము (తెలంగాణా శాసనములు మొదటి సంపుటము నం. 20)లో 'గణపతి ఓరుగల్లు మొదటి పట్టణముగా పృథివీరాజ్యము సేయుచుండఁగాను' అనుటకుదోడు కాకతీయ రుద్రదేవ మహారాజులు పృథివీరాజ్యము సేయుచుండఁగాను అని యున్నది. అట్లే ఆ సంపుటము నం. 32 బూరుగగడ్డ శాసనములోను దాని కాలము శ = క్రీ.శ. 1258 దానియందు కాకతీయ రుద్రదేవమహారాజు రాజ్యము చేయుచుండఁగాను అనియున్నది. అట్లే రాజ్య చరమకాలమునను S. I. Inseriptions Vol X, నం. 472 పల్నాడు తాలూకా, పిన్నాలి శాసనమునందును శ. సం. 1214 = క్రీ.శ. 1292.

కాకతియ రుద్రదేవమహారాజు ఓరుగల్లు రాజధానిగాను పృథివిరాజ్యంబు చేయుచుండఁగాను అని.

కనుక రుద్రదేవమహారాజులొకరున్నారు కనుక ప్రతాపరుద్రునికి యువరాజయినప్పుడు 'కుమార రుద్రమహారాజు' అని వ్యవహారము. అప్పుడును దిగ్విజయము నాడును అతఁడు బాలుఁడే.

(2) బాల్యక్రీడిత దిగ్జయః

బాల్యమునందే అతనికి దిగ్జయము క్రీడయయినది. ఇది దిగ్విజయానంతరము ప్రకృతులవాక్కు. నాటక ప్రకరణము 1-5-25 రాజ్యాభిషేక కాలమున కతఁడు బాలుఁడు. అనఁగా చిన్నవాడు. ఇంతేకాక నిజాము వారి తెలంగాణా శాసన సంపుటి 1 నం. 35 నందు ముమ్మడి మల్లికార్జున నాయకుఁడు పానుగల్లునందు వేయించిన శాసనమున 16-5-1290కు సరియగు వికృతి, జ్యేష్ఠ శుద్ధ 6 నాటిశాసనము 'కుమార రుద్రదేవమహారాజులకు పుణ్యంగాను అయు తత్పుత్రితనయః ప్రశస్తి పృథివీం' అని రుద్రమ పుత్రితనయుఁడు బాలించుచున్నాడని యుఁగలదు. కనుక కుమారులు ప్రతాపరుద్రుడే దిగ్విజయానంతరము దిరిగివచ్చునపుడు ప్రతాపుడు వేటకును బోవును.

(3) ప్రతాపరుద్రుఁడు కొండకు దేవతల జూడ నేగగా రుద్రమ అనును
"అహో శైశవేపి ఉచిత కారిత్వం వత్సస్య వీరరుద్రస్య"

శైశవము నందును వత్స వీరరుద్రుడు ఔచిత్య మెఱింగి పనిచేయుట

దిగ్విజయానంతరము ప్రతాపరుద్రుని ప్రకృతులు మెచ్చుకొందురు.
యచ్ఛైశవేప్యతిశయిత తరుణ కాకతీయ పరాక్రమస్య విక్రమః

శైశవమునందును అతని పరాక్రమము తరుణ కాకతీయుల పరాక్రమమును మించినది.

వీరరుద్రుఁడన ప్రతాపరుద్రుడాఁయను సంశయమున కవకాశము లేదు. ప్రతాపరుద్రునికి శ్లాఘగా వీరరుద్రుడనియు వ్యవహారము కలదు.

సూత్రదారుడు :-

విష్ణోః విశ్వైకవీరస్య కాకతీయ కులేస్థితం
అవతారమముంజ్ఞాత్వా వీరరుద్రం ప్రచక్షతే

విశ్వైకవీరుఁడు విష్ణుఁడు కాకతీయ కులమున నవతరించియున్నాఁడని యెఱింగి అతనిని వీరరుద్రుఁడనుచున్నారు. ఈ పరాక్రమమెల్ల దిగ్విజయము నాఁటికే. అంతకు ముందతడు యుద్ధపరిశ్రమ మెఱుఁగడుగదా! ఇది వరకు సూచించినట్లు రుద్రమ కుమారుఁడు రుద్రదేవుఁడు మల్కాపుర శాసన నిర్దుష్టుడు ఆ శాసన కాలమున కిరువదియేండ్ల వాడయిన క్రీ. శ. 1291 ప్రాంతములకేబదియేండ్ల వాఁడయియుండును. తన్నాతఁడు బాల్యోత్సవక్రీడతః బాలుఁడని నిర్దేశించుకొనుట యసహజముఃగదా! ఇతరులును ఎంతప్రేమకలిగియున్నను ప్రకృతులే 'శిశు'వని ఏబదిపైబడిన వానినివ్యవహరించుట హాస్యాస్పదము. రుద్రమ్మయు ప్రేమకోలది "శిశు" వన్నను ఏబది ఏండ్లవాని నట్లునదు. 'శిశువు' అని యమ్మమెచ్చుకొనుటలో వింతలో వింత కనుక.

ప్రతాపరుద్రుఁడు క్రీ॥ శ॥ 1290 నాఁటికిరువది, యిరువదియయిదు యేండ్ల వాఁడనుట యుక్తమగునూహ। అతఁడును క్రీ॥ శ॥ 1261 నాటికిరువది యేండ్లుండు రుద్రదేవుఁడు నొక్కరే యనుట పొసఁగదు.

శాసనముల జూచిన నింకొకవిషయమును విశదమగును. కాలక్రమమునఁ జూడవలయును. వాని యందు మల్కాపుర రుద్రదేవుఁడేమైనాడో చూడవలసినచో ప్రతాపరుద్రుని కవకాశమే లభింపదు గదా.

తెలంగానా శాసనముల I సంపుటి నం. 34 శాసనము శ. 1187 ప్రభవ క్రీ. శ. 1267 నాటికి కాకతీయమహారుద్రదేవ మహారాజొకఁడు ఆ శాసనమునఁ జెప్పబడియున్నాఁడు. అంతకుముందే ఆమె నామము శాసనములందు; రుద్రదేవకుమారుడే రాజేకాని, మనకు రుద్రదేవమహారాజు కాడు. ఇతడు కాకతీయులకు మనుమడు రుద్రదేవ మహారాజే రుద్రమకుమారుఁడు ఆఁనాటికి మహారాజైనట్లున్నాడు. ఆపాటి కిరువదియయిదేండ్లయిన నుండవా ?

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

ఇంకొకటి ఇతని మనుమడని నిర్దేశించుట కింకొక రుద్రమదేవుడుండవలెను. అట్లే ఆ కాలమున నింకొక రుద్రదేవుడున్నాడు. అతడు రుద్రదేవుఁడను వ్యవహారము గల రుద్రమదేవియే. ఇట్లే కొన్ని శాసనముల కడపటి చక్రవర్తి ని'మన్మ'డని వ్యవహారము గలదు. S.I. Inscriptions Vol. X లో నం. 488, ద్రప్పిచర్ల శాసనమున. నం. 489 శ. 1222=1300 క్రీ.శ. శార్వరీ, నందిగామలో నడగూడెము శాసనము, నం. 491 కారెంపూడి శాసనము క్రీ. శ. 1303 ఆయనను శ్రీమనుమ మహా మండలేశ్వర కాకతీయ ప్రతాపరుద్రదేవ మహారాజులని వ్యవహరించియున్నారు. శ్రీ 'రుద్రదేవ' మహారాజులకు అనఁగా రుద్రమకు' 'కుమార రుద్రునికి' భిన్నుడని నిర్దేశింప నితని మనుమ రుద్రదేవుఁడని వ్యవహరించియున్నారనియే చెప్పవలెను. ఇందు చేతను నితడుఁను రుద్రమకుమారుఁడును ఒక నామము దాల్చిన భిన్న వ్యక్తులని దేలుచున్నది.

South Indian Inscriptions Vol. X నం. 413 నర్సారావుపేట కనుపర్రు శాసన మొకటి కలదు. దాని కాలము క్రీ॥ శ॥ 1189 = క్రీ శ. 1267. ఈ శాసనము మల్కాపుర శాసనమునకు తరువాత నారేండ్లది. ఈ శాసనము ప్రతాపరుద్రదేవ మహారాజులకు ధర్మార్థంగాను వేయబడినది. రుద్రమదేవికేనాఁడు శాసనములందు ప్రతాపరుద్రుఁడని వ్యవహారము లేదు. ఈయన యెవరు ! మల్కాపుర శాసన నిర్దిష్టుడే గదా ! ఈతఁడప్పటికే అధమపక్షము యువరాజయిన నయి యుండవలెను గదా ? మహారాజత్వమును దల్లితో.గూడ పరిపాలనాధికారమును బొందియుండును. కాకతీయ సంచికాకారులమతమున నతనికప్పుడు పదునాలుగేండ్ల వయస్సు. అతఁడే కడుపటి చక్రవర్తియనుకొన్నచో పదునాలుగేండ్లకే రాజ్యమిచ్చియుందురా ? అది సహజము కాదు. మామతానుసారమతనికి మల్కాపురము నాటికి యిరువది యేండ్లయినపుడు కిరువది ఆయిదేండ్లకి రాజ్యమిచ్చి యుండుటసంభవమును అసహజమును.

జూలకల్లు శాసనమున నతని కుమార రుద్రదేవ మహారాజు వ్యవహారమును జూచియుంటిమి. అనఁగా క్రీ॥ శ॥ 1291 నాటికి 'ప్రతాపరుద్ర దేవమహారాజు' కుమారరుద్రదేవుఁడాయెను. ఏల ? రాజ్యమునకుఁ దగఁడని డిప్రమోషన్ చేసినారా ? దీనినిబట్టియే అతఁడితఁడుకాఁడు. క్రీ॥ శ॥ 1267 వాడు. రుద్రమ కొరసుడు క్రీ॥ శ॥ 1291 నాటిఁవాఁడు, దత్తుఁడు అని తేలుచున్నదిగదా!

తర్వాతఁజూడఁదగిన శాసనము క్రీ॥ శ॥ 1280 నాటిది. అది S.I. Inscriptions Vol. X నం. 451 బందరు తాలూకా మల్లవోలు గ్రామమున చిన్మయేశ్వర దేవాలయమున నున్నది. దాని కాలము శ.క. 1202

క్రీ॥ శ॥ 1280 దీనిని వేయించినవాడు మహారాజు కంగరక్షకుఁడు పోలచమూపతి

"విఖ్యాతధైర్యే ప్రబలవిక్రమే శ్రీ మత్ప్రతాపరుద్రేశే
నిత్యం సామ్రాజ్యదీక్షితే తస్యాంగ్గరక్షనామాంకో
ఖ్యాతః పోల చమూపతిః" అని కలదు.

ఈతడు విఖ్యాతధీరుఁడు ప్రబలవిక్రముఁడు శ్రీ మత్ప్రతాప రుద్రదేవుఁడు. సామ్రాజ్యదీక్ష పూనియున్నాఁడు. కనుక నితఁడు క్రీ.శ. 1291 నాటి కుమారరుద్రదేవుఁడు, యుద్ధపరిశ్రమ మెఱుఁగని వాఁడు అని వాడిన విశేషణములు తెలుపుచున్నవి.

ఇతఁడు క్రీ.శ. 1267 నాటివాఁడే, అనఁగా రుద్రమదేవి కౌరసుడే పైన ఇతఁడధమ పక్షమున రుద్రమకు తోడు మహారాజయి యుండినాఁడని క్రీ.శ. 1267 శాసనముచేఁ దెలిసికొంటిమి, అందును 'సామ్రాజ్య దీక్షితుడు' పైన చెప్పినట్లే సామ్రాజ్య దీక్షితుడైనవాఁడు క్రీ॥ శ॥ 1291 జూలకల్లు శాసనమునకు 'కుమార రుద్రదేవు' డేల కావలసి వచ్చెను. ఇద్దరును భిన్న వ్యక్తులు గనుకనే యది నిర్ణయము.

క్రీ॥ శ॥ 1280 తర్వాత అనగా నతని కప్పటికి నలువదయేండ్ల వయసైన నుండును. ఆపై నే శాసనమునను నీతని పేరు లేదు. జూలకల్లు శాసనము నందలి కుమార రుద్రదేవుఁడుతప్ప.

రెండు శాసనము లందును అనగా మల్లవోలు శాసనమునందును కనుపర్రు శాసనమునందును ఇతనికి వంశనామము 'కాకతి' యను మాటయే చెప్పరు. ఇతనిని కాకతీయుడని యేల చెప్పలేదు? ఇతరుల శాసనములందెల్ల తాము 'కాకతీయుల' మని 'కాకతి తిలకుల'మని చెప్పుచున్నారే గదా

ఇతండు కాకుండుటచేతనే అని యూహింప వచ్చును. ఇతఁడు చాళుక్య వీరభద్రుని కొడుకు! కనుక కొడుకునే కాకతీయుడని యెట్లు వర్ణించుట? కడపటి మహారాజులెల్లెడల కాకతీయ వంశనామముతోనే వ్యవహరించుచున్నారు. యువరాజకాలమునను నరపతిత్వకాలమునను ఈ రెండు శాసనములందు చెప్పిన ప్రతాపరుద్రుఁడు కాకతీయుడని వ్యవహరింపకుండుటచేతను ఇతఁడు రుద్రమ కౌరసుఁడు, దౌహిత్ర దత్తుఁడు కాఁడు అని సారాంశము. మల్కాపుర శాసన నిర్దిష్టుఁడు ప్రతాపరుద్రుఁడుగాఁడు.

| | శ్రీరుద్ర దేవుఁడు | ప్రతాప రుద్రీయము రెండవ యతఁడు | ప్రతాపరుద్ర దేవుఁడు కాకతీయుఁడే |
|---|---|---|---|
| 1 పుట్టుపేరు | రుద్రదేవుఁడు | | క్రీ. శ. 1292 అనగా |
| 2 వంశము | కాకతీయుడుగాడు | | దిగ్విజయము కాలము |
| 3 వయస్సు | మల్కాపురము | | నకు ఇరువది ఏండ్లు |
| | శాసనము | | అని యూహ. జననము |
| | క్రీ. శ. 1261 నాటికి ఇరు | | దాదాపు క్రీ. శకము |
| | వది యేండ్లు కనుక | | 1270. దిగ్విజయము |
| | జననము క్రీ. శ. 1214 | | వఱకు క్రీ. శ. 1291వరకు |
| | | | యుద్ధపరిశ్రమ |
| | క్రీ. శ. 1261 నాటి కి ప్రఖ్యాత | | యెఱుగఁడు. |
| | విక్రముఁడు | | |

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

గాథలను బట్టి (అవి ప్రబల ప్రమాణములుకావు గాని) ప్రతాపరుద్రుదెపుడు జన్మించెను ?

రుద్రమరాజ్యమునకు వచ్చిన తర్వాత ముమ్మడంబకు సంతానము లేకుండుటచేత మొగిలి చర్లకు ఏక వీరాదేవి నారాధింపబోయినది. అప్పుడు హరిహరుఁడు, మురారి దేవుఁడనువారలు కోట నాక్రమించుకొనిరి. రుద్రమవచ్చి యుపాయమున గోట ప్రవేశించి వారలను జంపించినది. గణపతి యప్పటికిలేఁడు.

కావుననే కాబోలు కా. సం. వారు ప్రతాపరుద్రుని జననము క్రీ. శ. 1254 అని నిర్ణయించుట. మల్కాపురము నాటికే విఖ్యాత పౌరుషుఁడైన రుద్రదేవుఁడు జన్మించినది క్రీ. శ. 1241, అని ఆ విశేషణముల చేతనే నిర్ణయించుకొంటిమిగదా. క్రీ. శ. 1241 యన్న రుద్రమయప్పటికి రాజ్యభాగిని యగుట కవకాశము లేదు. కనుక గాథలు రుద్రమ రాజ్యప్రారంభము నాటికి కడపటి చక్రవర్తి జన్మించియుండలేదనియు చెప్పుచున్నవి. S. I. Inscription Vol. X నం 398 త్రిపురాంతక శాసనమును బట్టి ఆమెకావత్సరము క్రీ. శ. 1261 రెండవ దివ్యరాజ్య వర్షము· రాజ్యప్రారంభము క్రీ. శ. 1259 కావలయును. తెలంగాణా శాసనముల 1 వ సంపుటము 32 నెంబరు బూర్గుగడ్డ శాసనము నాటిదే అనఁగా శ.సం. 1180=క్రీ. శ. 1158 కే శ్రీ రుద్రదేవ మహారాజు రాజ్యము చేయుచుండెనని చెప్పుచున్నవి. కనుకఁ గణపతి చనిపోయినది క్రీ. శ. 1261, సూర్యగ్రహణమునకు అనఁగా మల్కాపురము శాసనమునాటికిలేడు గనుకను ప్రతాపరుద్రుని జననము తర్వాతనై యుండవలయును గాని తత్పూర్వము జరుగలేదు. గాథలనుబట్టి అట్టిచో మల్కాపురము నాటికే ప్రఖ్యాత బలపౌరుషుఁడు రుద్రదేవుఁడు కడపటి ప్రతాపరుద్రుఁడని చెప్పుట కుదరని యసాధ్య విషయము. మల్కాపుర రుద్రదేవుఁడు రాజై సామ్రాజ్య దీక్షితుఁడై యుండిన కాలము కడపటి క్రీ॥ శ॥1280 అని తెలిసినది. కాకతి కుమార రుద్రదేవ మహాదేవ నామము క్రీ. శ. 1291లో కనవచ్చుచున్నది. కావున నతనిదత్తత ఆరెండు సంవత్సరముల మధ్యమున జరిగియుండవలయును. ఇందులో వేఱొకవిషయము. ఒకరు ప్రతాపరుద్రీయమున నున్న

"స్వీకృతే పుత్రభావేన ! దౌహిత్రే ప్రాజ్ఞ మాజ్ఞయా"

యనుటకు పాఠాంతరము నొకదానిని 'పితురాజ్ఞయా' అని, దత్తత గణపతి యనుజ్ఞచేత జరిగెనని చెప్పినారు. చెప్పుటకు గారణము మల్కాపుర శాసన నిర్దిష్టుఁడు రుద్రదేవుడు ప్రతాపరుద్రుఁడే వారి మతమున నగుట చేత. గణపతి క్రీ॥ శ॥ 1261 లోపలఁ జనిపోయినాఁడు గదా.

ప్రతాపరుద్రీయము నీ కార్యము గణపతిది గాదు. అది తప్పర్థము చేసికొనుట. ఆ వాక్యము స్వయం భూదేవునిది. రుద్రమ కలలో నాయన కన్పించి మనుమనికి, దనయుఁడుగా గ్రహింపఁబడిన వానికి రాజ్యమిమ్మనెను. కనుక ఔరసతనయా అనంతరమున రాజ్యాధికారి ఎవరని ఆలోచించు నామెకు దౌహిత్రునే పుత్ర భావమున గైకొమ్మని యాజ్ఞను స్వయంభూదేవుడిచ్చినట్లు కవి రచించెను. కావుననే నతని పేరును 'ప్రతాపరుద్రుని' పుట్టుపేరునుమార్చి 'కుమారరుద్రదేవ' నామమున గ్రహించినది· అది

చనిపోయిన వాని పేరే, పుట్టుపేరు) ఇతండును తద్రూపుఁడే. ఇతనికి పట్టాభిషేకానంతరము ముందు వానికి వలెనే ప్రతాపరుద్రయని సమాఖ్యము లభించినది.

ఆయభిషేకమునకు గారణము స్వయంభూదేవుని యాజ్ఞయు, తన నగరవాసులే ముఖ్యమునని ప్రతాపరుద్రీయము మాట. కాక కాకతీయుల వంశాచారమును రాజనీతి నిర్బంధమును వరుసగా పరికించిన ప్రోలుఁడు చనిపోయిన వెంటనే కల్లోలములు, రుద్రదేవుడతిరుద్రుడై శత్రువుల నంగటి సణఁచి రాజ్యమును గైకొనుట. అనుమకొండ శాసనమున క్రీ॥ శ॥ 1262 వర్ణితములైన నతని విజయములలోఁ బెక్కు అతని తండ్రి బ్రతికియుండఁగ నార్జించెను. అతని యంత్యకాలమున మఱల కల్లోలములు. గణపతి మొదటి నుండి రాజ్య సౌధ నిర్మాణమును బ్రారంభింపవలసి వచ్చెను. అతని చరమ కాలమున రుద్రమయుగొన్నియేండ్లు ఆయనతోఁ గూడ రాజ్యభారమును వహించినది. అట్లే ఆమె రాజ్యంత కాలమునను మనుమఁడు యువరాజయ్యును తోఁడు మహారాజై రాజ్యభారము వహించినది.

రాజనీతియు అట్లే నిర్బంధావసరమును గల్పించినది. గణపతి రాజ్య చరమ కాలమున కొక యాడుగూతురునే రాజ్యాధి కారిణిగఁ జూపించినది. కావున శత్రువుల బారినుండి రాజ్యమును రక్షించి కూతురును మహీపతిగా నెలకొల్పుటకు తాను బ్రతికియుండగానే ప్రయత్నించినాడు. అప్పటి శత్రువులనఁగా పరరాజులే గాదు స్వీయగోత్రులు దాయాదులును. ఔరసుఁడు కొండవలే పెరిగి కూలిపోయెను. దౌహిత్రుఁడు చిన్నవాడు. దాయాదులున్నారు. తానుండఁగానే యతనిని సింహాసనమెక్కించి రాజపదమున నతని రూఢము చేయవలెనని ఆమె కోర్కె. శత్రువులు పాండ్యాదులు విజృంభించుచున్నారు. తాను వయసునఁ బెద్దది మనుమఁడుగా కున్న నామెకు నింకెవరు అపేక్షణీయులైనతోఁడు. కావున దత్తునికి రాజ్యమొసంగ నభిలషించినరి.

ఆ రాజ్యాభిషేకమెప్పుడు జరిగెను ? దిగ్విజయానంతమున. దిగ్విజయము ఎప్పుడు జరిగెను ? శాసనములందేని చెప్పఁబడినదా ? ప్రస్తుతమున ఆధారమైన ప్రతాపరుద్రీయమున నా కాలము స్పష్టముగఁ జెప్పలేదు. కాని వేరురీతిగా నిర్ణయింపవచ్చును. యువరాజుగ నున్నపుడు కుమార రుద్రదేవమహారాజుగా నున్నవాఁడు మహారాజగునప్పటికి ప్రతాపరుద్ర మహారాజగునుగదా!

క్రీ. శ. 1290 మల్లికార్జున నాయకుని పానుగల్లు శాసనమునను (16-5-90), క్రీ. శ. 1291 జూలకల్లు శాసనమును ప్రస్తావించును. కాకతీయ కుమార రుద్రదేవుడ్రు క్రీ. శ. 1291 లో (తెలంగానా శాసనము Vol. 1 నం॥ 35 పానుగల్లు శాసనములో 'కాకతీయ కుమార రుద్రదేవమహారాజే' అందును 'ఆత్మజా కుర్వతి రాజ్యమున్నతం' రుద్రమదేవి ప్రస్తావము కలదు.

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

తెలంగాణ శాసనములు Vol. 1 నంబరు 43 గణపవరము శాసనము. కాలము శకవర్ష 1214 నందన చైత్రమున వ్రాయబడినది=క్రీ. శ. 1292 మార్చి - ఏప్రిలుల

ఇందుప్రతాప కుమార రుద్రదేవమహారాజులు 'పృథివీరాజ్యం చేయుచుండఁగాను' అని కలదు. ఈయన ప్రతాపరుద్ర దేవుఁడే! జన్మనామ సంకలనము నిందు గలదు. అప్పుడును రాజ్యకర్త రుద్రమయే యని కుమార పదప్రయోగముచే తెల్లమగు చున్నది.

ఆ సంపుటములోనే నం॥ 44, 45 మణుగూరు శాసనములు కలవు. వీని కాలము శక 1216 నందన మాఘమాస మందు అనఁగా క్రీ. శ. 1294 అగును. ఇందులో నొక విప్రతిపత్తి వచ్చినది. నందన చైత్రము క్రీ. శ. 1292 ఏప్రిలు ఆయిన నందన మాఘము క్రీ. శ. 1294 అగునా ? కాదు క్రీ. శ. 1293 ఫిబవరి. మార్చి కావలయును. ఏది సరియైన తేదీ ? అనఁగా సంవత్సరము నందననుబట్టి. క్రీ. శ. 1293 ఫిబ్రవరి-మార్చి యనుటయే సరి. శకసంవత్సర సంఖ్య పొరపాటు లేకున్న శక వర్షము 1216 = క్రీ.శ. 1294 అగును. అందు మాఘము క్రీ. శ. 1295 ఫిబవరి యగును.

ఈ శాసనమునందు ప్రథమముగా 'కాకతీయ ప్రతాప రుద్రదేవ మహారాజులు పృథివీరాజ్యము చేయుచుండఁగాను' అని కలదు. కావున నందన వర్షములో శకవర్షము 1214 = క్రీ.శ. 1292 ప్రతాపరుద్రుఁడు రాజ్యాభిషిక్తుఁడయ్యెనని నిర్ణయము. క్రీ. శ. 1292-93

S.I. Inscriptions Vol. X నం. 479 త్రిపురాంతక శాసనమునందేదాని కాలము శ. స. 1216 =క్రీ.శ. 1294 దీనిని వేయించిన అదిదంమల్లు నాయకుఁడు తన్ను "శ్రీమత్ప్రతాపరుద్రదేవ మహారాజ్య సామ్రాజ్య ధురంధర" అనియు రుద్రదేవ దక్షిణ భుజాదంత' అనియు వర్ణించుకుని యున్నాడు. కావున మణుగూరు శాసనము లందిచ్చిన శకవర్షసంఖ్య తప్పని ఆశకవర్ష మున మాఘము మున్ను ప్రతాపరుద్రుఁడు రాజ్యాభిషిక్తుఁడయినాడని అనుకొనగూడదని తీర్మానము. అతఁడు రాజ్యాభిషిక్తుఁడగుట నందనలోనే, క్రీ.శ. 1292-93 లోనే. దానికి తర్వాత శాసనములందెల్లెడల నితని నామము--'కాకతీయ ప్రతాపరుద్రమహారాజ' నియే కన్పించుచున్నది. ఇదియు మల్కాపుర రుద్రదేవుఁడును కడపటి చక్రవర్తియు నొకరు కాదని రూఢపఱచుచున్నది మల్కాపుర రుద్రదేవుడు క్రీ॥ శ॥ 1267కే రాజ్యాభిషిక్తుఁడు. కడపటి చక్రవర్తి పట్టాభిషేకకాలము క్రీ॥ శ॥ 1292. కొందరను నట్లు క్రీ॥ శ॥ 1295 కాదు.

A.H R.S. Vol. 38 Pt. IV

ఈ విమర్శనములచే ప్రాప్తమగు సిద్ధాంతము. రుద్రమ కౌరసపుత్రుడు గలఁడు. అతఁడు చాళుక్య వీరభద్రుని కుమారుఁడు. అతఁడు రాజ్యాధిపతియై రుద్రమకు దోడుగా నథమపక్షము క్రీ॥ శ॥ 1280 వఱకైన రాజ్యము చేసెను. తర్వాతనే కారణముననో, నెందో అతఁడు గతించెను. అతనికి సంతతియున్నట్లు కాన్పించదు. అతని పినతల్లియగు గణపాంబకు సంతతిలేదు. గణపతి వంశమిట్లు నిర్వంశముకా రుద్రమ తన దౌహిత్రుని దత్తునిగ గైకొని రాజ్య ప్రతిష్ఠితుని జేసెను.

అనుటచే రుద్రమస్వయముగా నతనికభిషేకము చేసినది. కొందరన్నట్లు ప్రతాపరుద్రుఁడామె మరణానంతరము రాజుగా లేదు. ఆమె తర్వాత గొంతకాలము రాజ్యమేలి తర్వాత నెపుడో కీర్తిశేషురాలైనది. ఆమె నగరవాసులైన ముఖ్యులచేత గదా మనమనికభిషేకము సంకల్పించినది. 'అస్మిన్నిధేహి ధౌరేయేగుర్వీ ముర్వీధురాం'అను స్వయంభూదేవుని యాజ్ఞానుసారమును.

ప్రతాపరుద్రుని జన్మము - తల్లిదండ్రులు

ప్రతాపరుద్రీయము. 1-14

మురారేర్యః పూర్వం జలనిధి సుతాయా మభవత్
మహాదేవాజ్ఞాతః సపునః అవనీభృద్దుహితరి'

పూర్వము లక్ష్మియందు మురారికి పుట్టినవాడే మరల రాచకొమారిత యందు మహాదేవునికిఁ గల్గెను.'

"దేవకీ ।చ। ద్వితీయా। విష్ణో। ర్మాతా। తదను। మహితా। ముమ్మదంబా। తృతీయా। 1-20

దేవకి విష్ణువునకు రెండవ తల్లియయినది, తర్వాత తృతీయ జనని ముమ్మదాంబ. మొదటి శ్లోకమున తండ్రినామము మహాదేవుఁడని రెండవ శ్లోకమున జనని నామము ముమ్మదాంబయని తెల్లముగాఁ జెప్పఁబడినది.

ముమ్మదమ్మ

రుద్రమదేవి కిద్దఱు కుమారితలు. ముమ్మదమ్మ, రుయ్యమ్మ అని తెలియవచ్చుచున్నది. మొదటి యామె ప్రతాపరుద్రుని తల్లియని ప్రతాపరుద్రీయ ప్రమాణము. రెండవ యామె ఇందులూరి అన్నదేవమంత్రిని వివాహమాడెనని శివయోగసారము. రెండవయామె విషయము చర్చాంశముగాదు. ఆమె బ్రాహ్మణ బాలికయనియు విశ్వేశ్వర శివదేశికుని దుహితయేమో యని కొంద రూహించి యున్నారు. అస్తు. ప్రస్తుతము ముమ్మదమ్మ విషయము తర్కింతము.

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

ప్రతాపరుద్రీయము

"భూభృద్దుహితరి" యనియామె రుద్రమ కూతురనియే చెప్పినది. లోకమున రాముడన్న దశరథ రాముడనియే బోధయయి, పరశురామ బలరాములని బోధగాదు, ఆయాయ పదేశములఁజేర్పకున్న. అట్లే కూతురన్న ఔరసపుత్రియనియే సామాన్యముగ బోధ. అట్లు కాదన్నవారిపై ఆవాదమును రుజువుచేయు భారమెక్కువగా నుండును. ఆధారములఁ జూపింపవలసినవారు వారు. వారి వాదస్వరూపమును దెలిసికొందము. దానికి ప్రమాణములు వెలుఁగోటి వారి వంశచరితావి గాథలును, శివయోగ సారమును. దానికి ప్రతిపాదించిన వారిలో ప్రముఖులు కీర్తిశేషులు సుగృహీతనాములు చి వీరభద్రరావు గారు.

గణపతికి పురుషసంతతి లేదు. తనరాజ్యముదాయాదులకుఁ బోవుట అతని కిష్టము లేదు. కూతురు రుద్రమ్మ రాజ్యము నేలగల శక్తిమతి. ఆయన చిన్ననాటనిండి ఆమెను పురుషుని వలెనే పెంచెను. రాజ్యనిర్వహణమునకుఁ దగిన విద్యాదుల నేర్పించెను. ఇది యెల్లలోకమునకుఁ దెలియకుండఁగనే రహస్యముగఁ జేసెను. కడకు రాజ్యస్థైర్యము నిమిత్తమొక యాడు బిడ్డనుదెచ్చి తన గురువు శివదేవయ్య ఆలోచనముపైని ప్రసాదాదిత్య నాయకుఁడు మొదలగువారి తోడ్పాటుతో రుద్రమదేవికిచ్చి వివాహము గావించెను. ఆమెయే ముమ్మడమ్మ.

ముమ్మడమ్మ కలరూపెటింగి ఖేదపడినది. గణపతియే స్వయముగనో కాక రుద్రమదేవికి స్వాతంత్ర్యము వచ్చిన తరువాతఁ నామెయో ముమ్మడమ్మనోదార్ప నామెను రుద్రమ్మ భర్త చాళుక్య వీరభద్రుని సోదరుఁడగు చాళుక్య మహాదేవ రాజున కిచ్చి వివాహము గావించి యామెకుఁ గల్గిన ప్రతాపరుద్రుని తన దత్తు చేసికొని అతనికి రాజ్య మిచ్చినది. ఇది యొక రీతివాదము.

దీని కాధారములు ప్రతాప చరిత్ర మొదలగు లోకలురికార్డులు. జనవదంతులు కడకు శివయోగసారము.

దీనికి గొంచెము మార్పుతో ప్రసాదాదిత్య నాయకుని కథ. గణపతి చనిపోయిన తర్వాత నాయన ముమ్మడమ్మకు బెండ్లిచేయుట తర్వాత నామెకు బిడ్డపుట్టగనో, కాదా ఆ సుతునికి రాజ్యార్హత కల్గిన తర్వాతనో రుద్రమను సంహరించి అతనిని ప్రభువును చేయుట. ఈవాదమును నింతమాత్రము స్ఫుటముగనైన నెవరును ప్రవచింపరు. దీని వలన వచ్చు వాదములు

మల్కాపుర శాసనమున నుక్తుఁడైన రుద్రదేఁడు కాకతీయ చక్రవర్తులలో గడపటివాఁడు అనఁగా ప్రతాపరుద్ర చక్రవర్తిఁ మల్కాపురమున "రుద్రదేవ్యాః సుతః" అనుటలో సుతశబ్దమును మనము పెంపుడు కొడుకని యర్థము చేసికొనెను.

ముమ్మడ పెంపుడు కూతురు. దీనికి ప్రమాణము శివయోగసారమునందలి యీ క్రింది పద్యము

"అకుపితరుద్ర మాంబికకు నాత్మజనా ।

బొగడొందు మమ్మదయ్యకు మహాదేవరాజునకు" ఇందు ఆత్మజనా బొగడొందు, అన్నదాని కర్థము పొగడ్త కాని యధార్థముగాదు. యాథార్థముగనామె పెంపుడు కూతురే. చాళుక్య వీరభద్రుని సోదరుఁడు మహాదేవుఁడు. అతఁడు చాళుక్యుడు. నిదురవ్రోలి పరిపాలకుడు. పెంపుడు కూతురు గావుననే రుద్రమ ముమ్మదమ్మనుమఱదికీయ జాలినది.

వాదమునమునకు ఎదురువాదమును శ్రీ॥ కొ. హ. శర్మగారు 1960 డిసెంబరు భారతిలో లేవదీసినారు. వారు ముళుకంటి శాసనము ప్రమాణముగా మహాదేవుఁడు చాళుక్యుఁడు గాఁడు. కాకతీయుఁడేను రుద్రమ తన సోదరుని వరుసవాడైన మహాదేవునికిఁ గూతురునిచ్చినది. మేనమామ గావునను అధమపక్షమున సాక్షాత్తుమేనమామ గానందున నట్టి పెండ్లి వరుస తప్పిన పెండ్లి గాదు. ఈ వాదముల నిజానిజములనే మనము తేల్చుకోవలసినది.

ఈ వ్యాస పూర్వభాగమున మల్కాపుర శాసనమున నిర్దిష్టుఁడైన రుద్రదేవుఁడును ప్రతాపరుద్రుఁడును భిన్నులనియు, రుద్రదేవుఁడు రుద్రమ కౌరసుఁడనియు, ప్రతాపరుద్రుఁడామెకు దౌహిత్రుఁడనియు సిద్ధాంతీకరించి యున్నాము. మల్కాపుర శాసనము నందలి రుద్రదేవ పరాక్రమ ప్రశంసచేతనతఁడప్పటి కిరువది యేండ్లవాఁడయిన నైయుండవలెననియు నిరూపించి యున్నాను. కనుక నతని జన్మము క్రీ. శ. 1241 ప్రాంతములలోనై యుండును. అప్పటికి రుద్రమకు ఎన్నియేండ్లు ? రాజ కులమున పదునాఱేండ్లకు మున్ను విశాహము చేయుట జరుగదుగదా ? వివాహమైన తరువాత వెంటనే పుత్రుఁడే పుట్టెనన, కాదుకి సంతతి వెంటనే గలిగినదని ఎవరు చెప్పఁగలరు ? ఒక నాలుగేండ్లయిన నుండవచ్చును గదా! కనుక రుద్రదేవ జననము నాటి, రుద్రమకిరువది యేండ్లని యూహింపవచ్చును. అసహజముగాదు. అప్పటికామె జన్మము క్రీ. శ. 1220 ప్రాంతములనై యుండును. ఆమెకు సోదరి గణపాంబజ్యేష్ఠ సోదరియో కనిష్ఠ సోదరియో? మొదటిబిడ్డపై తండ్రికి మమకారముండుట సహజముగనుక రుద్రమజ్యేష్ఠమనియు గణపతి యామెనభిమానించెననియుఁ దలంతము. గణపాంబ జననము కావున క్రీ. శ. 1222 ప్రాంతముల నుండవచ్చును.

గణపతి తండ్రిమరణమునాఁటి కెన్నియేండ్ల వాఁడు ? South Indian Inscriptions Vol. X నంబరు 367 త్రిపురాంతకము శాసనమున అనఁగా శకవర్షములు 1181 సిద్ధార్థి కార్తికము=క్రీ.శ. 1259 నవంబరు-డిసెంబరులు నాఁటి శాసనమున" స్వస్తిశ్రీ మన్మహా మండలేశ్వర కాకతీయగణపతి దేవులమహారాజుల దివ్యరాజ్య వర్షంబులు (౬౧) అని కలదు. 1198 క్రీ.శ. అతనిరాజ్య ప్రారంభకాలము, హేమాద్రి, యాదవరాజుల యాస్థాన పండితుడు. అతఁడు రచించిన 'రాజప్రశస్తి'లో నప్పటికి గణపతి చెఱలో నుండెనని, జైతుగి యాదవరాజతనిని, త్రికళింగాధీశుని యుద్ధమున సంహరించి విడిపించి రాజ్యాధీశుని

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

జేసెనని అప్పటి కతఁడు బాలుఁడని' యున్నదని చి. వీరభద్రరావుగారి యుద్ధారము. బాలుఁడన్నప్పటి కతనికి పండ్రెండ్లేడుల యీడైన నుండక తప్పదుగదా! గాథలో అతఁడు రుద్రునికి దత్తుకొడుకని (ఒక శాసనమున నతఁడు రుద్రుని కౌరసుడనియు నున్నటుజ్ఞప్తి) అతఁడు రాజ్యమును పొందకుండఁగా మహాదేవుఁడు రాజ్యమున్గ్రహింపఁగా ప్రకృతులు ఒప్పకుండఁగా శత్రువుల బాధ దీర్చికొన రాజీగా గణపతి తరపున తాను పాలించుచుండెనని యనుచున్నది. కనుకనతనికప్పటి కిరువదియేండ్లున్న చని పోవునాటికి ఎనుబదియేండ్ల వృద్ధుఁడగును. అప్పటికి రుద్రమ జనన కాలమునకతడు నలువదియేండ్ల వాడగును. నలువదియేండ్ల కతనికి ప్రప్రథమముగా పుత్రికోదయమని తలంచుటకన్న ముప్పదిరెండేండ్ల ప్రాయమున రుద్రమ జనించెననియు తర్వాత రెండేండ్లకు గణపమ జనించెననియు నూహించుటబాగు. ఆ కాలమున నలుపది యేండ్ల వాఁడయినను తరువాత పదియేండ్ల వఱకైన అనఁగా గణపమ జన్మము తర్వాత నేఁబదియేడులైన రాక మునుపే నతఁడిక పురుష సంతతి పుట్టదని నిరాశచేసికొని యుండునా ? క్రీ. శ. 1232 వఱకు) అతనికి నిరాశ జనించియుండునేమో ? అప్పటికి తన కౌరసపుత్రుఁడుండి యుండడు. ఉండిన నెంతకును పుత్రునికి రాజ్యమీయఁ జూచునుగాని కుమార్తెకీయ నుద్యమింపఁడు. పండ్రెండేడ్ల రుద్రమ లోకోత్తర ప్రతిభాతిశయమును గుర్తించియు, ఆనాఁటికి జ్యోస్యాదుల యెడల, గురునియాదేశముల యెడల స్వయంభూదేవుని ఆజ్ఞాను సారమున అతఁడు కుమార్తెకు రాజ్యమీయ నిశ్చయించియుండును. తరువాత నామెకు రాజనీత్యాదుల నేర్పియుండును. ఇఁకనాలుగేండ్ల కామెకు చాళుక్య వీరభద్రునితో వివాహము. తర్వాత నాలుగేండ్లకు సుతోదయము. గణపమయు రాజ్యతంత్ర ప్రవీణయే. ఆమెభర్త మరణానంతరము ముప్పదియేండ్ల కెక్కువకాలము ధరణి కోటరాజ్యమును పాలించినది.

క్రీ. శ. 1220 నాటికి పుత్రుఁడు కలుగఁడని నిరాశచేసికొను కారణమేమి ? తర్వాత గణపమయు జనించినది కాదా? రుద్రమ పుట్టగనే గణపతి ఆమెకు రాజ్యమీయనంతకు ముందే యూహించి ఆమెస్త్రీత్వమును రహస్యముగ నుంచినాడా ? గణపమ కట్టు చేయలేదా ? ఆమెకు అనఁగా రుద్రమకు పదునారేండ్లకు చాళుక్య వీరభద్రునితో వివాహము జరిగి యుండునుగదా ? ఆ వివాహము రహస్యమేనా ? మఱియంతకుముందేగదా ఎక్కడినుండియో ముమ్మదమ్మనుదెచ్చి పురుషవేషధారిణి యైన రుద్రమకుఁబెండ్లి చేసి యుండవలెను. అప్పటికి రుద్రమ కెన్నియేండ్లు ? అప్పుడు సామ్రాజ్య మేమయిన అసాధారణ పరిస్థితులలో నుండెనా ? క్రీ. శ. 1220 కేమయిన నుపద్రవములు రాజ్యమున నుండెనా ? అప్పుడుగదా గణపతి వెలనాటిని జయించుచుండినది. కనుక నప్పుడు బిడ్డను పురుషుడుగా పెంచవలసిన కారణమేమి ? ఈ కట్టు కతకేమిప్రమాణము ? ఏదియులేదు. శాసన ప్రమాణములకిది విరుద్ధము.

ప్రసాదాదిత్యునికథ ఈ కథకు తోబుట్టువు. శాసనములఁజూచిన తండ్రి కూతురులు కుదురుగ రాజ్యమేలుచుండిరనియు దాదాపు క్రీ. శ. 1258 నుండియైన గణపతితోడు రుద్రమయు అందఱికిఁ దెలియునట్లుగ రా జ్య భా ర ము ను మోయుచు శాసనములు తీయించుచుండిరనియుఁ దెల్లము. క్రీ. శ. 1258 ముందే ఆమెకు యౌవరాజ్య మిచ్చియుండుటయు సహజము. వివాహము బహిరంగము, సుతోదయము బహిరంగము, దేవీత్వము బహిరంగము, ఇకగూఢతయేమి ? యాదవ మహాదేవుఁడు స్త్రీను తాను సంహరింపనని ఆంధ్రులు స్త్రీని రాజ్యసింహాసనమున నుంచిరనిగదా వాగినాఁడు.

ప్రతాప రుద్రీయము రుద్రమదేవి లోకోత్తర మహామహిమాశాలి యని ఆట్టిది, ఆమె కీశ్వర ప్రసాదమునఁగలిగిన దని వర్ణించినాడు.

ఈ కట్టుకతలలో భాగము ప్రసాదాదిత్యుని ఘనత. అతడు రుద్రమను జంపి ప్రతాపుని రాజ్యమున నుంచినాడనుట ప్రతాపరుద్రీయముకాక శాసనములును క్రీ. శ. 1292 తర్వాత రుద్రమ బ్రతికియున్నదని చెప్పియున్నవిగదా! కట్టుకతలనమ్మి చరిత్రల రచించుటేమి ? అందును దానికి విరుద్ధములగు శాసనములు లభించుచుండగా ఇది చరిత్రకారుల రీతికాదు.

ఈ కథలలో నొక్కమాటయే నిజము, రుద్రమను గణపతిపుత్ర నిర్విశేషముగఁబెంచి సకలవిద్యలు నేర్పించినాడు "సదృశమత్ర పుత్ర ఇతిర్వ్యవహారః తదనుగుణాచ రుద్రఇత్యాఖ్యా" అని ప్రతాప రుద్రీయముమాట అనగా, చేసిన పుత్రుడను వ్యవహారము ఆమె మహిమకు సదృశము దానికిఁ దగినట్లు చేసిన "రుద్ర" నామకరణము.

క్రీ. శ. 1240 మున్నె ఈ కతల ప్రాకారము ముమ్మదమ్మకు పురుషవేష ధారిణియైన రుద్రమతో వివాహము జరిగి యుండవలెగదా ! వివాహమగునప్పటికి ముమ్మదమ్మకు పదునారేండ్లు జరిగియుండిననుకొన్న తర్వాత నెప్పుడు సుతోదయము ? వారిమతము ప్రకారము (కా. సం.) క్రీ శ. 1254. అప్పటికామెకు ముప్పదియేండ్లవయస్సు. అప్పటికి ఆమెకు మొదటి సుతోదయమైనదా ? ఈలోఁగా క్రీ. శ. 1240 కే రుద్రమదేవి వివాహముజరిగి సుతోదయమైయున్నదే ? ఆమెకు రుయ్యమ్మయుఁ బుట్టియున్నదే ? దౌహిత్రీ దౌహిత్రు లున్నను గణపతి యెక్కడనుండియో వచ్చిన ముమ్మదమ్మ కుమారునికి రాజ్యమీయుడని అనియుండెనా ?

ఇదివరకే రావుగారి వాదమున నొకయంశము 'మల్కాపుర శాసనమున' 'రుద్రదేవ్యాః సుతః' లో సుతుడను మాటకు పెంపుడు కొడుకని చెప్పకొనవలయు ననుట ఖండించియున్నాము. ఇక శివయోగసారము నందలి పద్యవిచారము.

కథలప్రకారము రుద్రమరాణి యయిన తర్వాతనేగదా మొగిలి చర్లకు ముమ్మదమ్మతోఁగూడ ఏకవీరామహాశక్తిని సంతానార్థము గొలువబోయినది. ఆమెరాజ్యాధిష్ఠానము శాసనముల ప్రకారము క్రీ. శ. 1158. తర్వాతగదా సుతోదయము అనగా ముమ్మదమ్మకు ముప్పదియాఱవయేట ప్రథమ సుతోదయము సహజమా ? అసంభవమని యనము. అ స హ జ మ ని మాత్రమందుము.

కథలకంటె నేనాడును శాసనములు చరిత్రకు ప్రధానాధారములు. ప్రతాప చరిత్రకు నకలు సిద్ధేశ్వరచరిత్ర, దానికి నకలు సోమదేవరాజీయము. ప్రతాప చరిత్రయే కథాకాలమునకు వందయేండ్ల తరువాతఁబుట్టినది. దానికి తర్వాతగదా యితరములు సమకాలిక శాసనములకంటే నివి యెట్లును ప్రమాణములుగాఁజాలవు.

ఇంతకు ముమ్మదమ్మనుకన్న తలిదండ్రులెవరో రావుగారు చెప్పరు. స్పష్టముగా ప్రతాపరుద్రీయమును నాదరించుతురు చాళుక్య వీరభద్రుఁడు, రుద్రమ అని శాసనములలో నున్నదానిని జూచియున్నను దాని నేకారణముననో నిరాకరింతురు.

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

ఈయన సహజవాదమును వదలుకొనుటలగ్గు. ముళుకంటి శాసనమును, "భూధరేంద్ర సుతాంస్నిగ్ధా ముపయేమే అని చెప్పుచున్నది.

ముమ్మడమ్మ రుద్రమ కౌరసపుత్రియే.

శివయోగసారమును ఈ మాటకు విరుద్ధముగా రావుగారు స్వీకరించిన పద్యమును పరీక్షింతము

ఆకుపిత రుద్రమాంబికకు నాత్మజ నాబొగడొందు
ముమ్మడయ్యకు మహాదేవరాజునకు' ప్రతాపరుద్రుఁడు జన్మించెను.

ఇందున ముమ్మడమ్మ పెంపుడు కూతురు. ఔరసపుత్రి కాదని కంఠోక్తిగలేదు. పెంపుడు కూతురనుట రావుగారుచేసిన యూహ. ఏల నట్టి యూహ చేసిరి.

మొదటి కారణము. వారు ముమడమ్మ భర్త మహాదేవుఁడు, చాళుక్య వీరభద్రుని సోదరుడని నమ్మిరి. మఱదికి రుద్రమ్మ కూతురు నెట్లు పెండ్లి చేయఁగలదను శంకతో నీమెను పెంపుడు గూతురు. అనుట కాధారముగా వారు ఈ పద్యమును గైకొనిరి.

పద్యమున నట్టి యూహ కవకాశము కలదా ?

"నాఁబొగడొందు" అని యుండుటచే రావుగారు వ్యతిరేకము నూహించిరి. కూతురు అనుట పౌగడ్త అనగా యదార్థము కాదు. అది పౌగడ్తయే. అది పౌగడ్తయెట్లుకాఁగలదు ? అది జనుల వ్యవహారము కావచ్చును. పెంపుడు కూతురును గాదు. అది కేవలము రుద్రమకు పుత్రికయేమో యన్నంత అభిమానము ముమ్మడమ్మ యందు అను నర్థము చెప్పుటకును వీలొసంగుచున్నది గదా !

అట్లు చెప్పిన ప్రతాపరుద్రీయమునకును ముళుకంటి శాసనమునకు విరుద్ధము. మాప్రశ్న పెంపుడు కూతురనుట పౌగడ్త యెట్లగును. పెంపుడు కూతురును కూతురనుట లేదా ? పెంపుడు కొడుకును కొడుకనుట లేదా ?

'ఆత్మజ' నాఁజను ఆత్మజనా ప్రథచెందు' అని యున్న రావుగారి యభీష్టము సిద్ధించెనేమో ! అంతఁ యభిమానముతో రుద్రమ మమ్మడమ్మను బెంచినదని యర్థము గావచ్చును. అట్లు గ్రంథమున లేదు.

పౌగడ్డదేనికి ? ఏదో గుణాతిశయమునకు. దానిని ఉత్ప్రేక్షోపమలతో వర్ణించి యుగ్గడింపవచ్చును. పెంపుడు పోవుట ఏగుణాతిశయమును సూచించును ? కన్నతలిదండ్రులు ఆత్మజులను దత్తుఒసంగుదురా ? అది బిడ్డలకు గుణాతిశయమును దెచ్చి పెట్టునా ?[1]

శివయోగసారము ముమ్మడమ్మయందు నేదే గుణాతిశయమును చెప్పియుండును.

లోకమున 'తల్లి చాలు బిడ్డ' అనుట సహజము. అదియు పౌగడ్త కాదు, తల్లిగుణవతియైన తప్ప. కాక 'ఆదౌర్భాగ్యు రాలి కింకెట్టి బిడ్డపుట్టును'అనవచ్చును. అనగా కారణగుణములు కార్యమునగన నగునని సామాన్యజనుల యుక్తియగుటయేకాక తర్క-శాస్త్రాదులొప్పినవియు. కనుక రుద్రమయందేదో గుణాతిశయమును జెప్పిననది ముమ్మడమ్మకు వచ్చును. ఆగుణాతిశయమే యుగ్గడింపవలసినది. అదియే శివయోగసారకారుని తాత్పర్యమును. రుద్రమనట్లే అతఁడు కేవలము బేర్కొనలేదు. అనగాఁ 'కేవలము 'రుద్రమాంబికకు నాత్మజనాఁ బొగడొందు' అననేదు. అన్న నింకొక యనర్థము వచ్చును. 'రుద్రమ' యనిమాత్రమన్న రుద్రమయందురౌద్ర గుణమును బ్రశంసించుట యగును. ఆ ధ్వనిని పరిహరింపవలెను. ఏదో యుద్ధామును జేయు 'రుద్రమ' నువర్ణించిన రుద్రమశత్రువులను జంపినది యనుట శోభావహము. ఈ సందర్భ మట్టిదిగాదు.

శివయోగసారకవియే 'అకుపిత రుద్రామాంబిక 'యని చెప్పినాడు. కనుక రుద్రమకుఁ గోపము లేకుండటను చెప్పిన వాఁడు 'రుద్ర'కుండు రౌద్ర గుణధ్వనిని పరిహరించుటయేగాక ఆమెయందు శాంతమును బ్రశంసించినాడు. తద్వారా ముమ్మడమ్మ అట్టిరాణికి కూతురుగాఁ బొగడ్తనందినది అన్నాడు. అనఁగా ముమ్మడమ్మ శాంతగుణమును జూచి జనులు ఈమెకు రౌద్రగుణము కల రుద్రమ్మ జననిగా నొప్పదు. కోపము లేని రుద్రమయే అట్లగును అని బ్రశంసించినారు. కవిత్వమున వక్రోక్తి ధ్వని శోభా వహములు గదా !

ఇంతదీర్ఘముగా జెప్పవలసిన పనియేల ? ఆపద్యమున్న సందర్భమునుసావధానముగఁ జూచిన రావుగారిట్లని యుండరు. ఆ పద్యమునకు తాత్పర్యము 'దండనాయక మహిమంబులండొరుదే యన్నయదేవురుద్రదేవుడున్' అనుటయే. కావున ముమ్మడమ్మ ఔరసత్వమును గాని తదన్యత్వమును గాని చెప్పుటకవి యుద్దిష్ట విషయమే కాదు.

---

[1] 'భూభృత్సుతా మహదేవాఁ పితరౌయస్య విశ్రుతౌ ! అని ప్రతాపరుద్రీయము చెప్పును. దీనికి 'రాచకూతురును మహా దేవులు వానికి తల్లిదండ్రులుగా ప్రసిద్ధులై యున్నారు' అని యర్థము చెప్పవచ్చునా? చెప్పి అట్లువారికి 'ప్రసిద్ధియే'గాని యాధా ర్థము కాదు. వారు ప్రతాపరుద్రుని దత్తుతెచ్చుకొన్నారు అని వాదించిన వారికి రావుగారి సమాధానమేమి ? కనుకనిట్లు యర్థము చెప్పకవక్త తాత్పర్యమును చూడవలయును.

ఉరుగంటి వెంకట కృష్ణయ్య

రావుగారికీ యర్థము ఏల స్ఫురించిన దనఁగా ముమ్మడమ్మ భర్త మహాదేవుడని చెప్పవలసియుండుట. ఆకాలము వారికి మహాదేవుఁడు రుద్రపోలి వాఁడొక్కడే కనవచ్చియుండుటయు, ఆతఁడును చాళుక్యవీరభద్రుని సోదరుఁడుగా వారికి స్ఫురించి యుండుటయు. ఆవాదములను పరీక్షింతము

ప్రతాపరుద్రుని తండ్రి మహాదేవుఁడుకాడని 'మహాదేవాజ్జాతః' అనుటకర్థము మహాదేవుని కృపవలన అని, అతని తండ్రి మారయ సాహిణియని, ప్రతాపరుద్రదేవుడు కుమార రుద్రదేవుడు అనఁగా భాస్కరరామాయణ కర్తలందొకఁడు అని అతఁడే తన తండ్రి అని 'నిశ్శంకవీరమారయ కుమార' యని తన్ను నిర్దేశించుకొన్నాఁడని యొకవాదము బయలుదేరినది. ఈవాదమునకు కళ్లు కాళ్లులేవని పూర్వోక్తశాసనములచే స్పష్టము గదా ! 'భూభృత్సుతా మహాదేవాకా పితరౌయస్య విశ్రుతౌ' అన్న వాక్యమునందలి మహాదేవ శబ్దము వ్యక్తినామమును చెప్పును. దేవుడని చెప్పదు. 'భూభృత్సుతా' యన్న పార్వతియని యే యర్థము. కనుక పార్వతీ పరమేశ్వరులే ప్రతాపరుద్రుని జననీ జనకులు, అని కవి చమత్కారముగా ప్రతాపరుద్రుని కుమార సమానునిగా ప్రౌఢముగా వచించినాఁడను వాదమొక్క మాటలో నిరస్తమై నేలఁగూలును. శివయోగసార పద్యముచే 'ముమ్మడమ్మకు మహాదేవరాజునకు' ప్రతాపుఁడు జనించెనని కంఠోక్తిగ నిర్ణయమే, కనుక ప్రౌఢకవిత్వాదుల నింపూహింపవలసిన పనిలేదుగదా. మనవారికిట్టి చిత్రవాదములేల తోచునో ? పురుషవేషధారులు ఆడవారు ఇంకొక పిల్లను బెండ్లియాడు సందర్భములు లోకమున బహుదేశముల బహుజనుల కాదరపాత్రములైన కట్టుకథలును నట్టినేకాఁబోలు. ముమ్మడమ్మ రుద్రమ్మ వివాహకథనట్టిదేగదా ? శాసనములందు ప్రతాపరుద్రుఁడుగ పరిణమించిన కుమార రుద్రదేవుఁడు కాకతివాఁడనియున్నది. దానిని గూడ భాస్కరరామాయణ కుమారరుద్ర వాదులు లక్షించి యుందురు. సాహిణి మారయ కాకతీయుడు గాడు గదా !

మహాదేవుడు కాకతీయుడనియే కొ.హ. శర్మగారన్నారు. వారి యభిప్రాయము ప్రకారమును భాస్కర రామాయణ కర్త కుమార రుద్రదేవుఁడు వేఱు ప్రతాపరుద్రుఁడు వేరు అనియే. వారివాదమున కాధారముగా వారు ఎపిగ్రాఫికా కర్నాటిక నుండి ముళుకంటి శాసనమును జూపియున్నారు.

'స్పష్ట శ్చాసీత్ ప్రథితమయాశసాం' 'కాకతీయాఖ్య వంశము' కీర్తివంతులైన కాకతీయమను పేరుగల వంశమును స్ఫజింపబడినది. అనియు

ఆ సీత్పురీ కాకత్యాఖ్యా రాజ్ఞాం, లోకేయశస్వినీ
ఆంధ్రదేశధరా పద్మమధ్యే కోశవదాస్థితా."

అరాజులపురి ఆంధ్రదేశభూమియను పద్మమధ్యముకు కోశమువలె నున్నది. లోకమునఁ గీర్తి కాంచినది. దాని పేరు 'కాకతి' కాకతియనఁగా వేఱేమో యనుకొనవలదు.

తంపురీ 'మోరుగ' ల్లాఖ్యా ! మవాసీత్ రాజవల్లభః
కాకతీయ మహారాజ। వంశదుగ్ధాబ్ధి చంద్రమాః
మహారాజా ఇతిఖ్యాతో రాజా సర్వగుణాన్వితః

ఆ పురిలో ఓరుగల్లు యనుపేరుగల దానిలో రాజునకు చాలా ప్రీతిపాత్రుఁడు కాకతీయ మహా రాజ వంశమును క్షీరసాగరమునకుఁ జంద్రుని వంటివాడు, సర్వగుణాన్వితుఁడు మహాదేవుఁడను ప్రసిద్ధుఁడు నివసించెను.

"సోపిఉమాం శంభువత్ కన్యా ముమ్మడంబ్బాం మనోరమాం
భూధరేంద్ర సుతాంస్నిగ్ధా ముపయేమే మహామతిః।

తనయెడల ప్రేమ గల రాజకుమారితను మనోహరమైన దానిని ముమ్మదాంబను పార్వతిని శంభుని వలె వివాహమాడెను.

"తస్యామావిరభూత్ శ్రీమాన్ మహాదేవః ప్రతాపవాన్"
ప్రతాపరుద్రరాజా కందర్ప ఇవమూర్తిమాన్

ఆమెకు శ్రీమంతుఁడు మహాదేవుఁడు ప్రతాపవంతుఁడు మూర్తి దాల్చిన మన్మథుని వంటివాడుఁ ఈ ప్రతాపరుద్రరాజు జనించెను. అని యున్నది.

ఈ శాసనము చాలా ముఖ్యము. ఇందున్న విషయములు విమర్శ సహములు. ఇవియే సత్యములగునేని దీనిచే

ప్రతాపరుద్రుని తండ్రి పేరు మహాదేవుఁడు. తల్లిపేరు ముమ్మదంబ. ఆమె రుద్రమ కూతురు. పెంపుడు కూతురుగాదు

కావున సాహిణి మారుఁడు ప్రతాపరుద్రుని తండ్రియన్న వాదము ప్రతాపరుద్రుని భాస్కరరామాయణ కర్త కుమార దేవుఁడన్న వాదము నిరస్తములగును.

ప్రతాపరుద్రుని తండ్రి కాకతీయుఁడు.

కావున నతఁడును కాకతీయుఁడు. భాస్కర రామాయణ కర్త కుమార రుద్రదేవుడుఁ గాడు. రావుగారి వాద ప్రకారము చాళుక్యుఁడును గాఁడు.

ఊరుగంటి వెంకట కృష్ణయ్య

అతని నివాసము ఓరుగల్లు. రావుగారివాద ప్రకారము నిడుదవోలుపరిపాలకుడుగాడు, తద్వాసియు గాడు.

ఇట్లు సకల వాదములకు స్వస్తియగును. ఇందు విమర్శసహములైన యంశములు-రాజపుత్రిపేరు 'వుమ్మద్యాంబ' ప్రతాపరుద్రీయమును బట్టి ప్రతాపరుద్రునితల్లి ముమ్మడాంబ. వుమ్మద్యాంబకాదు. ఇదిస్వల్ప భేదముకాదు. "ఉమ్మడి" 'ముమ్మడి' యొకటియగాదు దీనికి సమాధానము వుమ్మద్యాంబా యనుట శాసన శిల్పియక్షరమును జెక్కుటలో స్ఖాలిత్యము. 'వు' 'కు' 'ము కు' దగ్గఱయే గదా! కాగా రుద్రమ తల్లికి 'ఉమ్మక్క' అని పేరుగదా! ఆమెకు 'సోమమ్మ' యను పేరు తర్వాతగదా వచ్చినది.

సైవ ఉమాచేతి నిర్దిష్టా సోమాచేతి ప్రధామగాత్ తవమాతా । శివాసాక్షాత్ దేవోగణపతిః పితా" 1-2 నాటక ప్రకరణము.

ఆమెకును ఉమయని నిర్దేశితమయినది. సోమయనియు పేరును బొందెను.

నీతల్లి సాక్షాత్తు శివయే, నీతండ్రి గణపతి శివుడు. కనుక రుద్రమ తల్లిపేరునే కూతురునకు బెట్టియుండవచ్చును. ముమ్మక్క యనియు వ్యవహారముండవచ్చును. ఉమ్మడి, ఇమ్మడి సమానార్థకములేమో; విచారింపవలెను.

మహాదేవుడు కాకతీయమహారాజ వంశదుగ్ధాబ్ధి చంద్రమా ? అనగా కాకతీయ మహారాజ వంశమను క్షీరసాగరమునకు చంద్రుడు. దీనికి కొందఱు 'దుగ్ధాబి చంద్రు'డనగా క్షీరసాగరమును పొంగించినవాడే అల్లుడయి సంతోషింపజేసిన వాడు. సముద్రుడు చంద్రునిజూచి పొంగును. కాకతీయ మహారాజ వంశమున కల్లుడయి వారిని సంతోషంపజేసినవాడే కాని కాకతీయ 'వంశుజు'డనికాదు అనవచ్చును.

దానికి సమాధానము 'వంశదుగ్ధాబ్ధి చంద్రమాః' అని శాసనము. కేవలము 'వంశసాగర చంద్రమాః' అని యుండిన మీరు చెప్పిన యర్థము అనగా కేవలము సంతోషింప జేసినవాడు మాత్రమే అని చెప్పవచ్చునేమో! ఇందుదుగ్ధాబి చంద్రమాః యని కలదు. క్షీరాబ్ధిని చంద్రుడుదయుంచెను. కేవలము సంతోషమును గల్పించువాడు మాత్రమే కాదుగదా! కనుక మహాదేవుడు కాకతీయ వంశమున జన్మించినవాడే.

ఈ సిద్ధాంతము మాకును ప్రతిపాద్యమే, విశ్వసనీయమే కాని యీ శాసనమునుబట్టిగాదు. ఈ శాసనము ప్రమాణమే గాదు. ఇది దగుల్బాజీశాసనము. ఇది యున్న 'ఎపిగ్రఫియా కర్నాటికా వాల్యూముచూచిన నందు పోద్ఘాతమునగొన్ని యంశము లున్నవి.

ఇది శిలాశాసనము గాదు. ఇది తామ్ర శాసనము. తామ్ర శాసనముల కంటే శిలా శాసనములెక్కువ విశ్వసనీయములేమో ? మూలశాసనము అన్నయ్యప్ప అను వారియొద్ద నుండినది. ఆతడు మూలప్రతిని గవర్నమెంటుకిచ్చి యుండలేదు. దాని ప్రతిని వ్రాసికొననిచ్చెను. మూలశాసనమిపుడు లబ్ధము గాదు. మూలశాసనము నందలి లిపిముద్ర మున్నగువాని సాహాయ్యమున నీశాసన నిజానిజములఁ బరీక్షింప వీలుగాదు. ఆ ప్రతిని వ్రాసికొనినవారు తమకుఁ బరిచయమునగు లిపిలోనే వ్రాసికొని యుందురుగాని కాకతీయులనాటి లిపియందు వ్రాసికొని యుండరు. అన్నయ్యప్ప మూలశాసనమును గవర్నమెంటువారికీయకుండుటయే వానికిని ఈ శాసనము కల్పితము అని తెలిసియుండెనని సంశయము కల్గించుచున్నది.

దీనికాలమిందే యీయఁబడి యున్నది.

"అతీతే బాణబాణే భగణితే శకవత్సరే, 5,5,8 = శ. ౮55 = క్రీ. శ. 933
శాకాబ్దే పంచ (5) పంచాశత్ (50) ఉత్తరేష్టశతే గతే (800) = శ. 855
సంప్రాప్తే విజయాబ్దేస్మిన్ శ్రీ రుద్రనృపతిస్స్వయం
కుంభే కృష్ణ చతుర్దశ్యాం సంపూజ్య విధివత్ స్వయం.

శాసన కాలము శకము 855 క్రీస్తుశకము 933 - 34. సరియే. మాఘమున 934 ఫిబ్రవరి ప్రాంతమే. సంవత్సరము సంఖ్యానామము సరిగనే యున్నది. ఈ వత్సరము, సంఖ్యకాల నిర్ణయము లేఖక ప్రమాదము గాదు. ఆలోచించివేసికొన్నదే. కవి స్పష్టముగాఁ జెప్పినదే.

ఏ శతాబ్దమునను 33 సంవత్సరములకుఁ గాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తి లేఁడు. క్రీ.శ. పదియవ శతాబ్దమున శాసన స్థలము కాకతీయ పరిపాలనలో లేదు. ఆ వంశమున నాశతాబ్దిని ప్రతాపరుద్రుఁడను రాజు లేడు. ఉన్నారని యేప్రమాణము లేదు. అనుమకొండ ఆ ప్రాంతముల నుండినదా ? ఎఱుక దేవరాజు పూర్వులు పెండిగుండమరాజో, పోరంకియో సిద్ధేశ్వర చరిత్రమును బట్టి స్థలమును లక్షింతము. ఇది మైసూరులో తుముకూరు జిల్లా శివగంగ చెంతనొక యగ్రహారమునకు సంబంధించిన శాసనము. ప్రతాపరుద్రుడు సైన్యసమేతుఁడై యందేగెనట. అప్పుడు శివరాత్రిరోజు నీదానము చేసెనట. ఇది తీర్థయాత్రా సందర్భమునట. ఈ ప్రాంతము కాకతీయ పరిపాలనము నెప్పుడును ఉన్నట్లు ప్రమాణములు గానుపింపవు. ఇకే శాసనమునను తీర్థయాత్రను ప్రతాపరుద్రుడు చేసెననుటకాధారములు కన్పింపవు.

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

శాసనము కొనసే మాటలున్నవి. "ఇతి శ్రీమదనంతపుర అగ్రహార ప్రదాతృ గజపతి వీరరుద్ర రాజకృత శాసనప్రతి లేఖనం నైరంతర్యం శుభకరమస్తు".

శాసనాంతర్భాగమున దాత కాకతిప్రతాపరుద్రుడు. అంతిమ భాగమున గజపతి వీరరుద్రుడు. ప్రతాపరుద్రునికి వీర రుద్రుడని వ్యవహారముండుట నిజమే. కాని అతనికి గజపతి యని పేరున్నట్లు కాన్పింపదు. ఆ బిరుదము కాకతీయులకున్నట్లు ఎక్కడను ప్రమాణము లేదు. గజపతి, నరపతి, హయపతి యనువాదము తురుష్క పాలనము ప్రారంభించిన తర్వాత. కపిలేంద్ర గజపతియే మొదటి గజపతియేమో ? అతడు ప్రతాపరుద్రుననంతరము ఓరుగల్లును బట్టుకొనినట్లు ప్రమాది మాఘమున నొక శాసనమున్నది. (తెలంగాణా శాసనములు Vol-I, ఇతర శాసనములలో, మొదటివి) (కనుక నా కాలము క్రీ.శ. 1340 ఫిబ్రవరి ప్రాంతమగును) తర్వాత అప్పటికి వీరరుద్రగజపతి లేడు. తర్వాత ప్రతాపరుద్రగజపతి యొకఁడు. అతడు కృష్ణదేవ రాయల సమకాలికుఁడు. పదునారవ శతాబ్ది ప్రారంభమున నున్నవాఁడు. కృష్ణదేవరాయలచే జితుఁడు. అతడీ ప్రాంతములకు వచ్చెనని (తీర్థయాత్రలకైనను) ప్రమాణము లేదు. వచ్చియుండినను అతఁడు ఉత్కళరాజ గజపతి వంశీకుఁడు, కాకతీయుడు గాఁడు. అతనికి 'వీరరుద్ర' వ్యవహారము లేదు. అతని కుమారుడు 'వీరరుద్ర గజపతి', ('వీరభద్ర గజపతి'యనియు నొక వ్యవహారము) యున్నాడు. కృష్ణరాయలకడ నతఁడు ప్రతాపరుద్ర గజపతి చేసిన సంధి పాలించుననుటకు హామీగానున్నవాడు. అతడు తీర్థయాత్రలకిందు వచ్చియుండెనేమో ? కాని యాతఁడు కాకతీయుడు కాఁడు ! ఆ కాలము పదునారవ శతాబ్ది కదా ! ఈ శాసనమా పదియవ శతాబ్ది యని, కాకతీయ వంశమని, రాజు ముమ్మడంబా మహాదేవరాజుల కొడుకని చెప్పుచున్నది.

కనుక నీ శాసనము కేవలము కల్పితము. తప్పుడు శాసనము. అగ్రహారదానము కాపాడుకొన నొక యోగ్యుడు కల్పించి ఇంగ్లీషు దొరలకు నివేదించినట్లున్నది. అతడు 'ప్రతాపరుద్రీయమును' జదివి కాకతిప్రతాపరుద్రుని కథను విన్నవాడే. కాకతి వంశము గజపతి వంశము భిన్నములని యాతఁడెరిగియుండఁడు. కింవదంతిని బట్టి యాతనికి దాతయొక వీరరుద్ర గజపతి యని తెలిసియుండును. ప్రతాపరుద్రీయమును జదివియున్నాడు గనుక ఆ కథను దీనికి ముడిపెట్టి యుండును. కాల విషయమున పొరపాటు తప్పదు. కాని ఈ కథ 'ప్రతాపరుద్రీయము' నెట్లితరులర్థము చేసికొనిరో తెలియ నగును.

కాని ప్రతాపరుద్రుని చరిత్రకు నీశాసనమును ప్రమాణముగా గైకొనరాదు. అగుఁగాక! ఈ విషయమును వదలుదము. చి. వీరభద్రరావుగారి వాదమునకుఁ బోదము. చాళుక్య మహాదేవుని కథకుఁ బోదము. ఆ మహాదేవుని సంతతి శాసనములలో గన్పించును. అతఁడే ప్రతాపరుద్రుని తండ్రి, ముమ్మడమ్మ భర్త యనుటకు రావుగారి కాధారములు నొక్కొక్కదానిని పరిశీలింతము. అతనికి చక్రవర్తి యను వ్యవహారము కలదు చక్రవర్తినికి జామాత, చక్రవర్తికిఁ దండ్రియగుటచేతనే ఆ వ్యవహారమును జనులొప్పుకున్నారు.

A.H.R.S Vol. 38 Pt. IV

చక్రవర్తిని కితఁడు జామాతయు యను విషయయే మనకు చర్చాంశము. ఇతని యన్నయని వీరభద్రరావుగారను చాళుక్య వీరభద్రుఁడు రుద్రమ భర్త యను విషయమునందతొప్పుకొని యున్నారు. ఆయన సంగతి జూతము. ఆయనకు సంబంధించిన శాసనములు 1) జుత్తిగ శాసనము 2) క్షీరరామ శాసనము 3) కొలనుపాక శాసనము. జుత్తిగ శాసనమును వేయించిన దొక యమాత్యుడు. విష్ణుకవి పేరు. తన తల్లికిఁ బుణ్యమునకు గానతడు దానము చేసినాడు. ఆ శాసనము S.I. Inscriptions Vol. X నం॥ 360 తణుకు తాలూకా జుత్తిగ యందున్నది. కాలము శ. 1181 = క్రీ.శ. 1159. అప్పటికి గణపతి యున్నాఁడు. రుద్రమయు, గణపతియు రాజ్యమేలుచున్నారు. ఆ శాసనమందున్నది ఇది

శ్రీమత్కాకతి వల్లభాద్గణపతి క్షోణీశ చూడామణేః
జాతారాజ్యరమేవ, రుద్రమ మహాదేవీ సురూపాన్వితా
తాం సౌభాగ్య బలాదుదూహ్య విధివత్ చాళుక్య వంశాగ్రణీ
ధాత్రీభార ధురంధరో విజయతే శ్రీవీరభద్రేశ్వరః ॥

ఇతఁడు చాళుక్యుడే. చక్రవర్తికి జామాత. చక్రవర్తిని భర్త. స్పష్టముగా నామాట యందున్నది. కాని యితఁడు నిదురప్రోలి పరిపాలకుఁడనిగాని, చక్రవర్తియనిగాని లేదు. ఇతని స్వవంశము వారికీర్తన మిందులేదు. ఇతఁడు ధాత్రీభార ధురంధరుఁడు 'విజయతే' అఁనగా నప్పటికి జీవించియున్నాడు.

క్షీరారామ శాసనము South Indian Inscriptions Vol. 5, నం. 122, వేయించినది ఉదయ మహాదేవి. కాలము శ. 1188 = క్రీ.శ. 1266 ఇందు వీరభద్రక్షితీశునికి పుణ్యమునకుగాను అతని తల్లి వేయించినది. ఇందు వీరభద్రుని తండ్రి ఇందు శేఖరుడని, తల్లి ఉదయాంబికయని కలదు. కొడుకు పుణ్యమునకుగాను తల్లి వేయించినదిగావున నతఁడు మరణించి యుండవచ్చును.

ఇందును వీరభద్రుఁడు నిదురప్రోలి పాలకుఁడని లేదు. చక్రవర్తి పదవ్యవహారమును లేదు. తనకితర సంతానమున్న దనియు లేదు.

కొలనుపాక శాసనము (తెలంగానా శాసనములు-1 సంపుటము నం॥ 25) వేయించిది ఇందుశేఖరుని సైన్య నాయకులు. దీని కాలము ప్రమాది మకరసంక్రమణము యనఁగా 1279-80 యగును. మకర సంక్రమణము క్రీ.శ. 1280 జనవరిలో వచ్చును. వేయించిన స్థలమును కొలనిపాక-తెలంగాణము.

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

ఈ శాసనమునుబట్టి రావుగారు చాలా పెద్ద విషయము నూహించినారు. ఇందుశేఖరునికి వీరభద్రుడు పెద్ద కొమారుఁడని. పరిశీలింపఁగా నిందు వీరభద్రుఁ డిందుశేఖరుని కొమారుడనియే లేదు. ఇందు మొదలు కాకతివంశ ప్రస్తావము 'అజనిషత భుజః ర్భూభుజో దుర్జయాఖ్యః వంశేతేషా మభువన్ కాకతీయా నరేంద్రాః'. ఇకప్రోల, మహాదేవ, గణపతి, రుద్రమల ప్రస్తావము కలదు. తర్వాత 'భార్యైః విశ్వస్య తస్యాః పతిరభవదథో వీరభద్రాభిధానః జ్యేష్ఠ్యః హశార్ణ'.... తరువాతి యక్షరములు గానరాక ఆ వైపు శాసనమంతటితో ముగిసినది. తరువాతి వైపు

యత్యైతేజస్ఫూర్తి వీరైః అగినృపతితమస్సం చయైః రాశు యాతం

ఇందుఁగల 'జ్యేష్ఠ' శబ్దమునుబట్టి వీరభద్రుడిందు శేఖరుని కుమారులలోఁ బెద్దవాడని రావుగారూహించినారు. ముందు చాళుక్య వంశ ప్రశంస తండ్రి ప్రశంస అతని కుమారుల ప్రశంసలేనప్పుడు 'జ్యేష్ఠ' శబ్దము కుమారులలో జ్యేష్ఠత్వమును జెప్పునా ? అతడెవరి కుమారులలో పెద్దవాడని చెప్పఁగలము. చాళుక్య వంశార్ణ........అను నక్షరములఁబట్టి చాళుక్యవంశార్ణవమున అనగా కుమారులలో జ్యేష్ఠుఁడని యూహింపఁగూడునా ? 'జ్యేష్ఠః' శబ్ద మిందు విశేషణముగాఁ బ్రయుక్తమయినది.

'వంశార్ణ'........అను నక్షరముల తరువాతి వాక్యమును బాంధవులను జెప్పునదిగాక ఎవరి పరాక్రమమునో చెప్పుచున్నది. ఇందు శేఖరుని ప్రస్తావన లేకున్న జ్యేష్ఠ కుమారత్వమును చెప్పలేదేమి యను మాటయేరాదు. తర్వాత

లక్ష్మాం బాయాం సుతోజాతః శ్రీమహాదేవరాజతః నామ్నా ఇందు శేఖరో రాజకుమార

యని కలదు. మహాదేవరాజునకు లక్ష్మాంబకు ఇందు శేఖరుడను కుమారుడు పుట్టినాడని యున్నది. అతని పరాక్రమ వర్ణనములున్నవి. ఇందుశేఖరుని భార్య పేరుగాని, ఇందు శేఖరునికి వీరభద్రుఁడు కొడుకని గాని, ఇతర కుమారులున్నారని గాని లేదు.

అయిన నిందు 'ఇందుశేఖర నరేంద్ర నందనే నంధతి స్వయ మశేషనందనే' అని కలదు. దానిని బట్టి 'ఇందు శేఖర నరేంద్ర నందనే' అనఁగా 'ఇందుశేఖర రాజకుమారుఁ డానందించుచుండఁగా' అనునర్థము దీసినట్లున్నారు. దానికి ముందింద్రు శేఖరునికి కుమారులున్నారని చెప్పినట్లును అర్థము చెప్పవచ్చును. అట్లు చెప్పియుండనందున నా యర్థము పొసఁగదు. 'ఇందు

శేఖరుఁ తను నరేంద్ర నందనుఁడు' అనియే అర్థము చెప్పనగును. శాసన పూర్వ భాగమున 'సామ్నా ఇందు శేఖరో రాజకుమార' యని యన్నారు గదా ! వ్యస్తముగా పై జెప్పిన దానినే సమస్త పదముగా "ఇందు శేఖర నరేంద్రనందనే" అని క్రిందుగా జెప్పినారు.

శాసన కడపటి భాగమున :

శ్రీనామ సాధనీయతా చ న వృత్తిహేతుః
వీరేందు శేఖర న రా ధిప శేఖరేణ।
చాళుక్య వంశమణి నా ప్రతిపాదితా సా

వీరేందు శేఖరునిచే తమకు శ్రీ ప్రతిపాదింపఁబడిన దనియు ననబడియున్నది. ఇందుశేఖరుని బంట్లు తమకీ సిరినిచ్చిన దతఁడని స్మరించినారు.

ఇందు వీరభద్రుఁడు చాళుక్యుఁడని మాత్రమే చెప్పబడినది. అతని వంశ ప్రస్తావనమే లేదు. తలిదండ్రులు సోదరులు ఎవ్వరి సంగతియు నిందుఁగనము. దీనిని బట్టి రావుగారతని కితర సోదరులున్నారని, అతఁడు పెద్దకుమారుడని ఎట్లు చెప్పగల్గిరో? అతని తలిదండ్రుల పేర్లిందు గానరావు. అతడు రుద్రమను పెండ్లియగుట ఇందు గలదు. కనుక నిందుచే మహాదేవునికి వీరభద్రునికి సంబంధమును, మహాదేవుని కనిష్ఠ కుమారత్వమును గాని వీరభద్రుని జ్యేష్ఠ కుమారత్వమును గాని యూహింపఁగాదు. ఈ శాసనముచే మహాదేవునికి వీరభద్రునికే సంబంధమును జెప్పఁగాదు.

అంతేగాదు. కనవచ్చిన వీరభద్ర సంబంధి శాసనములచే నతనికిని నిడుదప్రోలి పాలకత్వమును జెప్పలేము. అతని నిడుదప్రోలి చాళుక్య వంశత్వమును జెప్పలేము. నిడుదప్రోలి యింటిపేరు గూడ నతనికిఁ జెప్పగాదు. దేనియందును నిడుదప్రోలియను మాటయే లేదు. 'నిడుదప్రోలి' వీరభద్రుడన్నను నిడుదప్రోలి యందొక్క చాళుక్య కుటుంబమే యున్నట్లు చెప్పనగునా ?

మహాదేవుని గూర్చిన శాసనములఁ బరిశీలింతము

**South Indian Inscriptions Vol. X** నం॥ 348 జుత్తిగ శాసనము. కాలము శ. 1177=క్రీ.శ. 1255 అప్పుడు గణపతి రుద్రమలున్నారు. వీరభద్రుఁడున్నాఁడు. వేయించినవారు మహాదేవుని బంట్లు బండారు కొండనాయకుడును అతని కొడుకు వీరభద్ర నాయకుడును. వేయించినది విష్ణువర్ధన మహారాజులైన వారికొఱకే. అనగా చాళుక్యుల కొఱకే వేయించినది.

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

'రామేశ్వర మహాదేవరకుం మహాదేవ చక్రవర్తి'కి ధర్మువుగా వేయించినారు. ఈ కాలమున ముమ్మడమ్మ జీవించి యున్నది. రుద్రమ కౌరసపుత్రుఁడు మల్కాపుర శాసనమున నిర్దిష్టుఁడున్నాఁడు.

ఈ శాసనమున మహాదేవుఁడు నిదురప్రోలి వాఁడనిగాని పరిపాలకుడనిగాని లేదు. అతని భార్య ముమ్మడమ్మ యని లేదు. వీరభద్రుని మంత్రి అతఁడు చక్రవర్తి యల్లుఁడని క్రీ. 1259లో చెప్పినాడుగాని మహాదేవుని బంట్లు చెప్పరు.

ఒకటి రెండు శాసనములఁ దప్ప గణపతికి చక్రవర్తి పదవ్యవహారము లేదు. శ్రీమన్మహామండలేశ్వర బిరుదమే. రుద్రమ శాసనములందు రుద్రదేవియోకాక శ్రీకాకతి రుద్రదేవ మహారాజులో శ్రీ ప్రతాపరుద్రునికిని శ్రీ కాకతిరుద్రదేవ మహారాజులు అనియే వ్యవహారము. వారెవరికిలేని 'చక్రవర్తి' పదమును ఆ రాజు కుటుంబ సంబంధముచే నితనికి వాడియుండుట యుక్తిసహమగు నూహయేనా ?

రావుగారి వాదము చొప్పున అన్నయగు వీరభద్రుఁడు చక్రవర్తి జామాత, చక్రవర్తిని భర్త యీ శాసనమునాటికి బ్రతికియున్నాడు. అతఁడును తగిలించుకొనని యీ 'చక్రవర్తి' పదము రాజకుటుంబ సంబంధముచేతనూ ఇతనికి దగిలింపబడినది. ఇది అన్న బ్రతికియుండగా భావ్యమేనా?'చక్రవర్తి' పదవ్యవహారమునకు రాచకుటుంబము బాంధవ్యమునకు ఏ యనుబంధము లేదు. ఆ సంపుటమునందే నం॥ 349 శాసనము జూడుడు-నర్సాపురము తాలూకా అచంటలోనిది. కాలము శ. 1177= క్రీ. 1255. దీనియందు-'విష్ణువర్ధన మహారాజులైన విజయాదిత్య చక్రవర్తి తమ కూతురైన మైలారదేవిని 'ఆసంబె సూతపరాజున'కిచ్చినాఁడని కలదు. ఇతఁడును చాళుక్యుడే. ఈ శాసనమును పై శాసనము నొక్కటియే. ఇందొక 'చక్రవర్తి' ఈ విజయాదిత్యునికిని 'చక్రవర్తి' వ్యవహారముచే రాజకుటుంబ సంబంధమును జెప్పగలమా ? ఆ సంబంధమేమి ?

S.I. Inscriptions Vol. IV నంబరు 112 కాలము క్రీ. శ. 1099

—— ,, —— 113 విష్ణువర్ధన మహారాజు........కాలము క్రీ.శ. 11·4 వీనియందు

బల్లహదేవ చక్రవర్తియు నితని కుమారుడు భీమదేవ చక్రవర్తియుఁ గనవచ్చుచున్నారు. వీరే చక్రవర్తి జామాతలు ? ఏ చక్రవర్తి తండ్రులు ?

అదే సంపుటిలో నం. 141 కాలము శ. 1181 = క్రీ. శ. 1259 నొక విష్ణువర్ధన మహారాజు ఉపేంద్ర చక్రవర్తి యొకఁడున్నాఁడు. గణపతి చక్రవర్తి, రుద్రమ, వీరభద్రుడు శ్రీ రుద్రదేవుఁడు జీవించియున్న కాలమే. వారి కీయుపేంద్రుని కేమి సంబంధము ? ఈయన ఎవరి జామాత ? ఎవరి భర్తలు ? ఎవరి దత్తులు ?

ఆ సంపుటిలో నం. 147 కాలము శ. 1222 = క్రీ. శ. 1300 శ్రీ ప్రతాప రుద్రుని రాజ్యకాలము. ఇందును విష్ణువర్ధన మహారాజులే. విష్ణువర్ధన చక్రవర్తియు నితని కుమారుడు. తోలేటి ఇందుశేఖర చక్రవర్తియుఁ గనవచ్చుచున్నాడు. వీరెవరికి జామాతలు ? ఏ చక్రవర్తికిఁ దండ్రులు ?

'తోలేటి' యనుటను లక్షింపుడు. అది మొదట గ్రామనామ మేగదా ! ఇది యింటిపేరై నిడుదప్రోలు మహాదేవ సక్రవర్తిలోని నిడుదప్రోలు యింటి పేరు గాకుండునా ?

ఈ కాలమునకు ముందును ఈ శాసన వత్సరమునను తరువాతి కాలమునను రావుగారుదాహరించు పిన ఉదయ మహాదేవి శాసనములు ఇవి. ఇంతకు ముందును, చాల పూర్వమే చక్రవర్తులుగాకున్నను 'చక్రవర్తి' పదమును నామమున వ్యవహరించుకొన్న విష్ణువర్ధనులున్నారు.

ఆ సంపుటిలో నం. 90 కాలము శ. 1099 = 1177 మల్లపదేవ చక్రవర్తి
నం. 91 శ. 1098 = 1176 ,,
నం. 93 శ. 1145 = 1222 ఉదయ చంద్రదేవ చక్రవర్తి.

వీరెవ్వరి కెవ్వరు ఏ విధమయిన రాజ కుటుంబ బాంధవ్యమును తదనుగుణముగ 'చక్రవర్తి' పదవ్యవహారమును జెప్పగలరు ? కనుక నీ పదవ్యవహారము నట్టి బంధుత్వమును జెప్పదు. అది నామాంతర్భాగమే 'కుమారస్వామి రాజు' ఏ యూరికి రాజుగాడు. ఏ యుపేంద్రుఁ డే యింద్రునికిఁ దమ్ముఁడును గాఁడు.

దీనిచే రావుగారన్నట్లు 'మహాదేవ సక్రవర్తి'ని ముమ్మడమ్మకు భర్తగను ప్రతాపరుద్రుని తండ్రిగను జేయుటకు మనకు శక్తి చాలదు.

S. I. Inscriptions Vol. X నం. 481 తణుకు తాలూకా మల్లిపూడి శాసనము కాలము శక 1219 = క్రీ. శ. 1297. దీనిని వేయుంచినవారు 'మహాదేవ క్షితీశాత్మజులైన విష్ణువర్ధన మహారాజులైన' ప్రిథివీవల్లభదేవ కుమారులుగారు. తాము నిడుదప్రోలి వారమనిగాని సక్రవర్తుల మనిగాని యాయన చెప్పుకొనలేదు. రావుగారు ప్రశంసించు "నిడుదప్రోలి మహాదేవుఁడు' తప్ప నీ కాలమున శాసనములో వేఱొక్క చాళుక్య మహాదేవుఁడు గానరాఁడు. ఈ శాసనమున నుదాహృతుఁ డతఁడే

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

యయియుండ నోపును. ఇందు మహాదేవునికి "నిడుదప్రోలిత్వము"గాని "సక్రవర్తి"త్వము గాని లేదు. రావుగారి వాదము ప్రకార మితడు ప్రతాపుని తమ్ముడో అధమ పక్షమున సవతి తమ్ముడో కావలెను. అట్లితడు చెప్పుకొనడు. ముమ్మడమ్మను గాకున్నను ఎవతెను తనదల్లి యనడు. కడకు తనకు 'సక్రవర్తి' పదమును గాకున్న మహారాజ పదమును వాడుకొనడు. కావున మహాదేవునికిప్పటికి ఏ శాసనముచేతను కాకతి సంబంధం గాని, నిడుదప్రోలి రాజత్వముగాని ముమ్మడమ్మ భర్తృత్వమునుగాని ఏర్పడలేదు.

రావుగారి విషయముల నొకరీతి నూహించిరేమో ?

కుటుంబము 1

చాళుక్య మహాదేవుడు = లక్కాంబ
|
చాళుక్య ఇందు శేఖరుడు = ఉదయాంబిక
|
చాళుక్య వీరభద్రుడు = రుద్రమ
|
రుద్రదేవి = ముమ్మడమ్మ = రుయ్యమ

కుటుంబము 2

చాళుక్య మహాదేవుడు

కుటుంబము 3

పృధివీ వల్లభదేవి ఉదయాంబిక

I ఈ మహాదేవుడు చాళుక్య మహాదేవుని మనుమడుగా నుండవలెను. కాకున్న అతనికి మహాదేవుడని యేల పెట్టుకొన్నారు ? అనివాదము.

II కుటుంబము వారు నిడుదప్రోలి ప్రభువులో కాదో

III మహాదేవుని భార్య పేరు తెలియదు. తలిదండ్రుల పేరులు తెలియవు.

కాని మొదటి కుటుంబమున నొక ఉదయమహాదేవి యున్నది. ఆమె వేరే రెండవ కుటుంబము వారింట నున్నది. కావున మహాదేవుని మనుమడు మహాదేవుడు కావలసినట్లు ఉదయాంబకు ఉదయాంబ మనుమరాలు గావలెను.

ఇంతయూ ఊహ. కానిండు. ఈ యూహపై బ్రహ్మాండ సౌధమును లేవదీసినారు. ఇంకను జూతము.

ఒక కుటుంబమున వీరభద్రుడు రుద్రమ భార్యాభర్తలుగ వర్ణితులైనారు.

ఎవరికి ఏల సిగ్గు వచ్చినదో ఇంట్లుగాని, తండ్రిగాని, కొడుకుగాని, కుమారితగాని కాకతీయ కుటుంబ సంబంధమును చెప్పుకొనరే.

కుటుంబ ఉదయ మహాదేవి శాసనములు

S.I. Inscriptions Vol. 5లో నం॥ 125 శాసనము కాలము శ. 1218=క్రీ.శ. 1294.

నిడుదప్రోలి మహాదేవ చక్రవర్తి కూతురు ఉదయ మహాదేవి తన భర్త కోనగణపతి దేవుని పుణ్యమునకు వేయించినది. "నిడుదప్రోలి" అనఁగా మహారాజత్వము చెప్పదని 'చక్రవర్తి' యనఁగానే రాజకుటుంబ సంబంధి కాదని నిరూపించి యున్నాము. ఇంకనొక విశేషము. శాసనమును వేయించినది ఉదయమహాదేవియే, పిన ఉదయ మహాదేవికాదు. ఆదేసంపుటి 127 శాసనము శ. 1122 క్రీ.శ. 1300. ఇదివేయించినది "మహాదేవ చక్రవర్తి కూతురు ఉదయ మహాదేవి" 'నిడుదప్రోలి' విశేషణము మహాదేవుని కెగిరిపోయినది.

ఆదేసంపుటి 124 కాలము శ. 1228=క్రీ.శ. 1306 వేయించినది 'నిడుదప్రోలి' మహాదేవ 'చక్రవర్తి' కూతురు పిన ఉదయ మహాదేవి.

ఇదివఱకులేని 'పిన' యీమె కెప్పుడు వచ్చినది? మహాదేవునికి 'నిడుదప్రోలి' త్వమునుచాలునా? చాళుక్యవీరభద్రేశ్వరుని తల్లిని మహాదేవుని తల్లినిజేయుటకు ఇదిచాలునా ? ఈ రెండు కుటుంబములకు సంబంధమున్నట్లు ఆ రెండవ కుటుంబమువారును చెప్పుకొనరే?

సామ్యమును బట్టి తాత మనుమలని అవ్వ మనుమరాండ్రని యూహించియూ చరిత్రముననింత సౌధమును లేవనెత్తుట. ఇకకోన వారి సంబంధముచే వీరభద్రుడు మహాదేవుడు సోదరులని యూహింతురేమో?

S.I. Inscriptions Vol. X నం.281 శాసనము శ. 1196=క్రీ.శ. 1234

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

దీనిలో కోనభీముని పత్ని అన్నమాంబ. ఆమెసోదరుడు చాళుక్య వీరభద్రుడు. భీమాన్నమాంబ కొమారుడు గణపతి అతని పత్ని మహాదేవుని కూతురు. ఇంతమాత్రము చేత వీరభద్రమహాదేవులే కోదరులనియెట్లు నిర్ణయముకాగలదు? వారిరువురును భిన్న కుటుంబముల వారేల కాకూడదు?

సారాంశము

చాళుక్య వీరభద్రునికిని వీరభద్ర కుటుంబమున తాతలవ్వల, తల్లిదండ్రుల పేర్లు తన పేరు, భార్యపేరులు, కుమారుల, కుమార్తెల పేర్లకు ప్రబల శాసనాద్యాధారములు కలవు.

రాజ కుటుంబ సంబంధము స్పష్టము.

చాళుక్య మహాదేవునికి సౌదర్యము చెప్పుగాదు మహాదేవుని కొమారుడు కూతురు ఈ మూడు పేర్లే తెలియును.

ఎందును కంఠోక్తిగ ముమ్మడంబ భర్త ఈ మహాదేవుడనిగాని ప్రతాపరుద్రుండితని కుమారుండనిగాని ఏ శాసనము లందును చెప్పలేదు.

ఈ చాళుక్య కుటుంబములొక్కటేయని యూహకాధారము ఈ మాహాదేవుడు ముమ్మడమ్మ భర్తయనియూహించుటకు. దానికై మహాదేవుడు వీరభద్రుని తమ్ముడని యూహచేసి, ఆ యూహలలో పెండ్లి వరుసలు సరిచేయ ముమ్మడమ్మను పెంపుడు కూతురును చేయుట ఊహదప్ప నిందీ సిద్ధాంతమునకు శాసనాధారము గాని గంథాధారముగాని విశ్వాస్యమైనది లేదు. ఇట్లు రావు గారి వాదమును నిరస్తమనిగాని మహాదేవుడు కాకతీయుడని వేఱితరుడనిగాని ఎట్లు నిరూపించుట?

వాదమునకు వీరభద్ర మహాదేవులే కోదరులని ఒప్పుకొన్నను ముమ్మడమ్మ రుద్రమ కౌరస పుత్రియని నిరూపించితిమి గాన నీ మహాదేవుడే ముమ్మడమ్మ భర్తయను వాదము చెల్లదు. పిల్లను చిన్నాయనకి యరుగదా:

మాయభిప్రాయము మహాదేవుడు కాకతీయుడనియే. ఆ వాదమును పరిశీలింతము

మహాదేవుడు కాకతీయుడని కంఠోక్తిగనే శాసనమునను లేదు. గ్రంథములందు నతడు ముమ్మడమ్మను పెండ్లి యాడినట్లే గాని అతని కాకతీయ వంశ్యత్వము నెవరును జూపినారు గారు. మఱియెట్లు?-అనగా గొన్ని శాసనములందు గాకతీయ ప్రభువులకు దాయాద కుటుంబములున్నట్లు గాన వచ్చుచున్నది గదా!

S.I. Inscriptions Vol. X నం. 254 త్రిపురాంతక శాసనము కాలము శ.క. 1131=క్రీ.శ. 1209. దీనిని మేళాంబిక వేయించి నది. మేళాంబిక గణపతి సోదరి. నతవాటి బుద్ధరాజు రెండవ కుమారుఁడు ఎక్కటిమల్ల రుద్రుని భార్య. ఇందు కాకతీయ వంశ ప్రశస్తి శాసన ప్రారంభమునఁగలదు.

ప్రోలరాజును వర్ణించిన తర్వాత

"తస్యాథద్వౌ వభూతాం, హరి హర గణపత్యాదిభి:
భ్రాతృమంతౌ, పుత్రౌరుద్రాభిధాన క్షితిపతి తిలక శ్రీ మహాదేవ భూపౌ"

అతనికి కిద్దరు పుత్రులు, హరిహర గణపత్యాదులు, సోదరులు గాఁగల వారు.

రుద్రఁడను పేరుగల రాజతిలకుఁడును, శ్రీమహాదేవరాజును పుట్టిరి. కనుక ప్రోలరాజు కుమారులు రుద్రుఁడు, మహాదేవుఁడు, హరిహరుడు, గణపతి, ఇతరులును. రుద్రునికి సంతతిలేదు. మహాదేవుని సంతతియే గద గణపతి? గణపతి కూతురులు రుద్రమ గణపమలు. హరిహరునికి గణపతికి నితరులకును సంతతి యున్నారని గాని లేరని గాని ఆశాసనము చెప్పదు. కనక యిందరు అని చెప్పలేము గదా!

ఈ సందర్భమున గాథలలో నొక్కదానిని విమర్శించిన బాగు. రుద్రమరాజ్యము నధిష్ఠించినది. ముమ్మడమ్మకు బిడ్డలు లేని కతమున వారిద్దరును మొగిలిచర్లకు ఏకవీరాదేవినిఁగొలువబోయి యుండఁగా ఓరుగల్లు కోటను హరిహరుఁడును మురారి దేవుడు నాక్రమించిరట. రుద్రమ్మ వచ్చి ఉపాయమునఁగోటలో ప్రవేశించి వారిరువుని బట్టించి తలఁగొట్టించినదఁట.

ఈ హరిహరుడెవఁడు? ఏలరాజ్యము గావలెననునాశ అతనికి వచ్చెను? వచ్చినను జనులు తన్ను బలపరుతురనియో తనకును రాజ్యమునకు హక్కుగలదనియో కారణముండవలయును. మహాదేవుని తమ్ములలో నొక హరిహరుఁడున్నాఁడు. వానికి మనుమడు హరిహరుడున్నాడు. అనిదీనిచే నూహింపవచ్చును గదా! తాతపేరు మనుమని కిడవచ్చునను లోకరీతిచేత అపుడ తఁడుఁకాకతీయుండను నేను. రుద్రమ యన్యగోత్ర. రాజ్యమున నాకే ఎక్కువ హక్కులని భావించియుండవచ్చును. కనుక రుద్రమ లేమియు ఆమె కుమారుఁడు రుద్రదేవుఁడు నూరలేకుండటయుఁ జూచికొని అతఁడు కోటనాక్రమించు కొనియుండుట భావ్యమేగదా! అతనికి తోఁడైన వాడు మురారి. ఇట్టి వాడొకడున్నాఁడని శాసనప్రామాణ్యము కలదు. S.I. Inscriptions Vol. X నం. 329 శాసనము. దీనిగాలము శ.క. 1172=క్రీ.శ. 1250 'దీనిలో' కొండపడమటి మురారి గణపతి దేవమహారాజు న్నాడని యున్నది. కనుక నీగాథ సత్యత్వమును మనము చెప్పక పోయినను దాయాదులు కాకతీయరాజుల కుండినారనియూహ కెడమిచ్చుచున్నది.

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

శర్మగారు చూపించిన ప్రమాణము కంచి ఏకామ్రనాథ శాసనము. శక 1172=క్రీ.శ. 1250 దీనిలో రుద్రుని వర్ణించిన తరువాత 'తదనుజగణ ముఖ్యశ్శ్రీ మహాదేవరాజః తపనకుల సముద్రాద్వాదృశః పారిజాతః" అని కలదు. మహాదేవరాజు రుద్రుని యనుజగణమున ముఖ్యుఁడు. అనఁగా రుద్రమహదేవులు కాక, వీరి కొక యనుజగణము గణశబ్దముచే ముప్వురైన నుండి యుండవలెనని హల్ట్జ్ దొరగారూహించిరని శర్మగారు దెల్పియున్నారు. వారికి సంతతియుండవచ్చును.

తెలంగాణా శాసనము 1 సంపుటము నం. 31 పమ్మి శాసనము దాని కాలము శక 1156 దుర్ముఖి క్రీ.శ. 1256 అగును. దానిలో 'కాకతీయ గణం రుద్రదేవ మహారాజులు పృధివీరాజ్యం చేయుచుండంగాను" అనికలదు. ఆకాలమున రాజ్యము చేయుచుండినది గణపతిదేవుఁడు. మొదటి రుద్రుడంతకు ముందు నలువది ఏండ్లకు ముందు గతించినాఁడు.

ఈ గణం రుద్రదేవుని కాలమున కిరువది యేండ్లకు పైఁబడిన తర్వాత గాని 'రుద్రమ' 'రుద్రదేవ మహారాజు' అని లేదు గనుక నీతఁడు కాకతీయ గణం వాడే' గాని కేవల రాజవంశమునవాఁడు గాఁడు. 'గణం' అనుటయే అట్టిదానిని వెల్లడించుచున్నది మొదటి రుద్రుఁడు సామ్రాజ్య కర్త. అతని పరాక్రమాతిశయము లెంత గాఢపు టాదరమును బెంచినవో గణపతి తన కూతురును రుద్రమ' యన్నాఁడు. దండ్రిపేర 'మహాదేవి' యనలేదు. అట్లే 'రుద్రమ' తనకొడుకును రుద్రదేవుఁడన్నది. తనమనుమనికి ప్రతాపరుద్రుడని పేరు పెట్టినది. అట్లే హరిహర గణపత్యాదుల శాఖల వారును తమ తమ కుమారులకు 'రుద్ర' నామ మిడుటలో సందేహము లేదు.

అట్లే యాదాయాద కుటుంబములలో మహాదేవ నామముండుటకు వీలున్నది గదా! చాళుక్య మహాదేవుఁడు ముమ్మడమ్మ భర్త యనువాదము నిదివఱకే పరిహరించియున్నాము. ఈ మహాదేవుఁడు ఆకాలపు రాజవంశములలో నొకరింటను బుట్టినట్లు లేదు. ఆ నాటి రాజవంశములు నాతవాటివారు, కొండపడమటివారు, కోటవారు వెలనాటియోధుడు జాయప సంతతివారు కోనవారు వీరందరి శాసనములు, ఆ కాలమునాటివి లభ్యమగుచున్నవి. ఒక్క చోటను ఈ మహాదేవ ప్రస్తావమునట్లు కాని పింపదు. చక్రవర్తి ని తన కూతురును సామంతరాజ కుటుంబమున నిచ్చియుండును గాని, తక్కువ వానికిచ్చియుండదు గదా! కనుకనీ 'మహాదేవుడు' ఇరత రాజవంశమునకుఁజెందిన వాఁడు గాక అ కాకతీయ గణ రుద్రదేవుని కుమారుడునై యుండవచ్చును. కాకున్న గాకతీయ రాజపుత్రిడితరుల కుటుంబోద్భవుఁడై యుండుట కవకాశమున్నది. ఏదో సామంతరాజ్యమును నేలుచున్న 'కాకతీయ గణం రుద్రుని కుమారు'డని నాయూహ, ఇది యూహామాత్రమే. కాని చాళుక్య మహాదేవుని కథకు వలే ఈ యూహకు విరుద్ధాంశము లెందును గానరావు చరిత్రకిది చాలదు. అన్వయ మార్గమున గాకతీయ మహాదేవుని యునికిని సాధింపవలయును. అది సాధ్యముగానిచో? అతని కుమారుఁడు గాకతీయుడని రుజుపడినచో నతడును గాకతీయుఁడే గదా! కనుక ప్రతాపరుద్రుఁడు 'కాకతీయు'డని రుజువయినచో మహాదేవుఁడు కాకతీయుఁడే యని రుజువగును గదా! కాని ప్రతాపరుద్రుడు దత్తుయిన తర్వాత గాకతీయుఁడే యగును. మనకుఁదెలిసిన శాసనముల నాఁటికా దత్తత జరిగిపోయి యుండినది. కనుక శాసనములందు మనము జూచునాఁటి కతడు దత్తుఁడును, యువరాజును. 'శాసనములతని కాకతీయుఁడని నిర్దేశించినను ప్రస్తుత చర్చాంశము అట్టియుదాహరణము తోడుపడదు. పుట్టుకలోనే అతఁడు కాంతీయుఁడని రుజుపుగావలెను. మనము గాథాదులనునమ్మ గుడ్డివారముగాము. ప్రతాపరుద్రీయమునే జూతము.

"కాకతీయకులాంభోధేః ప్రభవత్యేష చంద్రమాః". ప్రక 2-8

కాకతీయకులమునుండి యీచంద్రుఁడుపుట్టినాఁడు. అయినను కొందరు షష్ఠి ప్రత్యయము చతుర్థ్యర్థమున వాడబడినదని వివరింతురేమో? వైయాకరణులు నిర్ణయింపవలసిన యంశము. కాని పంచమ్యర్థము సామాన్యము.

'సాటికి 'తపనకుల సముద్రాత్ యాదృశో పారిజాతః' అని ప్రయోగమును జూడుఁడు. 'కాకతీయ మహారాజ వంశదుగ్ధాబ్ధి చంద్రమాః' అన్నపుడు మనము పంచమ్యర్థమునే యిచ్చియున్నాము.

యోయంజాతః త్రిలోకీ ప్రథితసు చరితే కాకతీయాన్వవాయే 3-37

మూఁడులోకములందన సుచరిత చేత ప్రఖ్యాతి పొందిన కాకతీయ వంశమున నితడు పుట్టినాఁడు. ఇది కంఠోక్తి దీని లక్షణ చేసి కాకతీయ వంశమునఁ బ్రవేశించినాఁడని యర్థము చెప్పవలసిన యవసరమేమి?

కాకతీయకులస్యకింను నసంపూర్ణం పుణ్యేన
యస్మిన్నవతీర్ణో భువనైక భద్రః ప్రతాపరుద్రం= 1-౩-16

భువనమున కేక శ్రేయస్కరుఁడైన ప్రతాపరుద్రుఁడెందవతరించెనో ఆ కాకతీయ కులమునకు పుణ్యము చేత సంపూర్ణము కానిదేమి?

'అవతీర్ణః' అనుటచేత ప్రతాపుని జన్మము కాకతీయకులమున నని స్పష్టము. దీనికి లక్షణార్థమేమి చెప్పవలెను?

కాకతీయకుల ప్రసవానాంక్షమం= 1-3-36

ఇది కాకతీయకులమునఁబుట్టిన వానికెందగినదే. ప్రతాపరుద్రునికిది మెచ్చుకోలు. పుట్టుక సుచరితము నకుఁగారణముగాఁ జెప్పుదురు గాని దత్తత నెవరును జెప్పరు గదా?

స్వస్తి కాకతీయ కులావతీర్ణాయ 1-5-36

కాకతీయ కులమున నవతరించిన వానికి స్వస్తి.

'యత్కుల ప్రభవో భవాన్?' 1-5-38

ఓరుగంటి వెంకట కృష్ణయ్య

నీవేకులమునఁ బుట్టితివో' 'ప్రభవ' శబ్దము పుట్టుకనే సూచించును. క్వసూర్యప్రభవో వంశః' సూర్యునుండి పుట్టిన వంశ మెక్కడ? అని రఘువంశము

పై యుద్ధారములకు సహజార్థ మిచ్చిన ప్రతాపరుద్రుఁడు కాకతీయవంశమున జన్మించినవాఁడనియే నిశ్చితమగును కావున మహాదేవుఁడు అతని జనకుఁడు కాకతీయుఁడే.

రుద్రమకాఁతడు సోదరుని వరుసయో? లేక మేనల్లుఁడో? ఎట్లయినను ముమ్మడమ్మను బెండ్లియాడుట కుదగిన వావియే యగును. కాదని యన్నిటికిని లక్షణార్థమును జెప్పఁజూచుట ద్రావిడ ప్రాణాయామమే యగును. మహదేవుడు కాకతీయుఁడగుట అతనికి రుద్రమ కుమార్తె నిచ్చుట రాజనీతియగును. ఏల యన

ముమ్మడమ్మ రుద్రదేవుని కనుజయని చెప్పియుంటిమి. ఆమె పెండ్లి యీడు క్రీ.శ. 1258 ప్రాంతములందయి యుండును. రుద్రమకు సహాయులుగా తమ వంశదాయాదుల నొకశాఖ యుండుట మంచిదికాదా ? కనుకనే వివాహము జరిగి యుండును. కాకతీయుల నొకశాఖవారు ప్రతిస్పర్థులైన, నొకశాఖ వారామెకు అండయై నిలిచిరి. ఇది గణపతి యాజ్ఞచే జరిగిన బెండ్లియే యనితోచుచున్నది. పిండితార్థము ప్రతాపరుద్రుండు పుట్టుకచేఁగాకతీయుడే. రుద్రమదత్తునిగాఁ గైకొనుటకతఁడు ముఖ్యుడును దౌహిత్రుఁడు కావున. గణపతి రెండవ కూతురునకు సంతానము లేదు గదా! ఈ సంబధముచే కాకతి వంశము వానియందే రాజ్యము నిల్చినది.

ప్రతాపరుద్రుని విషయమున చర్చితములు కావలసిన విషయములు.

1. ఇతడు చతుర్థకులజుఁడా కాక క్షత్రియుఁడా.
2. ఇతడు స్మార్తుడా? వీరశైవుడా?
3. బౌద్ధజైనులను బాధించెనా!
4 పద్మనాయకుల నభిమానించి రెడ్డి కులజుల ననాదరించెనా?
5. అతనికి సంతానము ఎవరు? అసలుండెనా?

నాకు మరల శాసనములఁజదువు అవకాశము కల్గినేని వీనిని చర్చింతును.

ఈ యంశములకు విరుద్ధముగ నైనను పోద్బలగములవైనను ప్రమాణములు కనవచ్చునని యాశింతును. కాకతీయుల శాసనములు గవర్నమెంటు వారికి లభ్యములైనవి. శ్రీరామేశము గారును శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారును దీనిని బరిశీలించు చున్నారు. అందు ఏమైన సూత్రాంశములు కననగుఁ గాక యని యాశింతము.





NAGARJUNAKONDA - BATHING GHAT